ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికాశతము. సంఖ్య-30.

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము.

ఇది

వెన్నెలకంటి అన్నయ్యకవిరచితము.





రెండవకూర్పు ౫౦౧.

కాకినాడ:

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ బ్రకటితము.

వెల 0_8_0.

సిటీప్రెస్, కాకినాడ.

1934.

# షోడశకుమారచరిత్రము.

పీఠిక.

ఇది యెనిమిదియాశ్వాసముల పద్యకావ్యము. కాని, మాకు దొరకినప్రతులలోఁ దృతీయ చతుర్థాశ్వాసములు లేవు. ప్రథమాశ్వాసమునఁ గృత్యాది లేదు. అచ్చటచ్చట గ్రంథపాతములు గలవు. మొదటి రెండాశ్వాసములు గలప్రతి యొకదానిని చెన్నపురి బ్ర॥ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పంపిరి. ఈ తాళపత్రప్రతిలో నీరెండాశ్వాసములును ౧౭౪వ పత్రము మొదలు ౧౯౯వ పత్రమువఱకుమాత్రమే యున్నవి. మొదటి ౧౭౩ పుటలలో నేమివ్రాయఁబడియుండెనో యాభాగమిందు లేదు. రెండవప్రతి, ౫-౬-౭-౮ ఆశ్వాసములుమాత్రమే కలిగి ౨౦౫-వ పత్రము మొదలుకొని ౨౭౮ పత్రములు సంఖ్య వేయఁబడి యున్నది. దీనిని, కాకినాడ, మ॥ దుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుపంతులు బి. ఎ., గారిచ్చిరి. మొదటి ౨౦౪ పుటలలో షోడశకుమారచరిత్రము ౧-౨-౩-౪ ఆశ్వాసములు మొదలైనవి వ్రాయఁబడి యుండవలెను.

శ్రీమా॥ బహుజనపల్లి సీతారామాచార్యులవారు శబ్దరత్నాకరములో నిందుండి కొన్నియుదాహరణముల నిచ్చియున్నారు. వారిచ్చిన ప్రయోగము లీముద్రితప్రతిలో నున్న

వియే. వారికిని బూర్ణగ్రంథము దొరకెనో లేదో యని సందేహము కలుగుచున్నది.

కవి, వెన్నెలకంటి అన్నయ్య. సీతారామాచార్యుల వారు, ఎల్లన్న యని తలఁచినారు. ఆధార మూహ్యము. ఆంధ్ర విష్ణుపురాణకర్త యగు వెన్నెలకంటి సూరయ్య గోత్రమును నీ యన్నయ్య గోత్రమును హారితసగోత్రమే. అన్నయ్య సూరామాత్యుని పుత్రుఁడు, సూరామాత్యుని తండ్రి యన్నయ్య యనియు, కవి యన్నయ్య తన కృతిని దండ్రియగు సూరామాత్యునకే యంకితము చేసె ననియు—

ద్వితీయాశ్వాసాదిని—సుకవిస్తోమ నుతౌన్నత్య యన్న సూరామాత్యా.

పంచమాశ్వాసాదిని—సూచిత మాహాత్మ్య యన్న సూరామాత్యా.

షష్ఠాశ్వాసాదిని—రసిక, వ్యాపార విహార మంత్రి యన్నయ సూరా.

సప్తమాశ్వాసా—శోభితషాడ్గుణ్య యన్న సూరవరేణ్యా.

అష్టమాశ్వాసా—శోభితపాండిత్య యన్న సూరామాత్యా.

అను మాటలంబట్టి తెలియవచ్చుచున్నది. విష్ణుపురాణ కృతికర్త సూరామాత్యుఁ డీయన్నయతండ్రి యనుకొందమన్న నాతనితండ్రి యమరనామాత్యుఁ డని కలదు. కవులచరిత్రములో నీయన్నయ్యపేరు నీషోడశకుమారచరిత్రమును లేవు.

జక్కనకవి విక్రమార్క-చరిత్రమును సిద్ధనమంత్రికిం గృతి యిచ్చెను. సిద్ధనమంత్రి పెద్దతండ్రి వెన్నెలకంటి సూర్యుఁ (భాస్కరుఁ) డని గ్రంథమువం దెలుపఁబడినది. (౧-౬) ఈ సూరనమంత్రి రెడ్డి వేమునరపాలునిచే నగ్రహారముఁ గొనియె నఁట. మఱియు ననపోతారెడ్డికి వెన్నెలకంటివంశజుఁ డగు మఱి యొకకవి కృతుల నిచ్చె నని విష్ణుపురాణములోఁ గలదు వీరి కిని అన్నయ్యకు నెట్టిసంబంధమైన నున్నదో లేదో తెలిసికొను టకుఁగాని మఱి యేవిషయమును దెలిసికొనుటకుఁగాని కృ త్యాది పద్యములు దొరకలేదు.

కవికాలము:—ఇందుఁ గవి తనకృతిభర్త యగునన్న య్యను, కృష్ణకందార, భోజ, జగదేకమల్ల, సోమేశ్వరులతోఁ (7-128) బోల్చియున్నవాఁడు. భోజుఁడు ధారానగరాధిపతి. జగదేకమల్లుఁడు పశ్చిమచాళుక్యచక్రవర్తి. వీరు పదునొకండవ శతాబ్దమువారు. సోమేశ్వరుఁడు భూలోకబిరుదాంకితుఁ డగు పశ్చిమచాళుక్యచక్రవర్తి (A. D. 1126-38). ఇతఁడు సంస్కృ తమున నభిలషితార్థచింతామణి యను మానసోల్లాసమును రచించెను. ఇతనికి సర్వజ్ఞభూపుఁ డనుబిరుదు కలదు. కృష్ణకం దారుఁడు యాదవరాజు. జైత్రపాలుని తనయుఁడు. పదుమూఁ డవశతాబ్దమున సూక్తిముక్తావళికర్త యగు జల్హణకవిని వే దాంత కల్పతరుకర్త యగు నమలానందుని బోషించెను. కాన నీగ్రంథము పదుమూఁడవ శతాబ్దానంతరము రచియింపఁబడి యుండును.

గ్రంథాకృతి:—ఈకవి దశకుమారచరిత్రమును మనస్సున నుంచుకొని యీ షోడశకుమారచరిత్రమును రచియించెను. కొన్ని కథలను కథాసరిత్సాగరాదులనుండి సంగ్రహించి తన కవితాచమత్కృతిచే రసపుష్టిని వర్ణనాధిక్యమును గలిగించి జనమేజయుని రెండవకుమారుని గథానాయకునిగఁ జేసి- అతనికిఁ దోడుగ నతని మంత్రితనయులను, బురోహితపుత్రులను, దండనాథసుతులను, బదేనుగురను గూర్చి కథ సాగించినాఁడు. కావున నందందుఁ గల షోడశరాజకుమారచరిత్ర మనుపేరు చెల్లదు. ఒక్కతావున షోడశనందనచరిత్ర మని యున్నది. దానికి బాధ లేదు.

కవిత్వము నిర్దుష్టమైనది. ఉభయభాషాప్రౌఢి మెఱయుచున్నది. శైలి మంచన కేయూరబాహుచరిత్రమును, జక్కన విక్రమార్కచరిత్రమును, కేతన దశకుమారచరిత్రమును బోలుచుండును. పద్యములు హృద్యములై ధారాశుద్ధి గలవిగా నున్నవి. ఎవ్వరియొద్ద నైన సంపూర్ణప్రతి యున్నచో దయతోఁ బంపి యీ షోడశకుమారచరిత్రమును బూర్ణముగాఁ బ్రకటించుభాగ్యమును వా రాంధ్రసాహిత్యపరిషత్తునకుఁ గల్గింతురుగాక.

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము.

## ప్రథమాశ్వాసము.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన కథా కల్పవల్లికామతల్లికకు నాలవాలం బగు హస్తినాపురం బెట్టి దనిన. ౧

గీ. ఆప                    ప్పురమునఁ
గాఁపురంబుండఁగాఁ జూడఁ గడలి వచ్చి
కోటసారరాక కూఁతుపైఁ గూర్మిఁ జుట్టు
వారియున్నట్టు లాప్పురి పరిఖ మెఱయు. ౨

గీ. అక్షయఖ్యాతి నెంతయు నందమొంది
యమల కమలోదయస్థాన మనఁగ వెలసి
కువలయప్రియహేతువై కొమరుమీఱి
యలరు నప్పురిపరిఖ దుగ్ధాబ్ధిభంగి. ౩

గీ. మహిత సన్మార్గవర్తన మాన్యులనఁగఁ
బొలుచు నినరాజకవిగురుబుధులనైనఁ
దగులువడఁ జేయు పెంపునఁ దనరు వీటి
కోటకొమ్మలు తారకాస్ఫోటనములు. ౪

సీ. ధామాద్భుతోద్దామహేమకుంభంబులు
తరణిమండలముతోఁ దడఁబడంగ

నుపరిభాగసాపితోజ్జ్వలరత్నంబు
లలతితారకములఁ గలసి బెరయఁ
బ్రమదకేళీలోలబాలముఖేందులు
చంద్రబింబంబుతో సరసమాడఁ
గనకరత్నవిభాసిఘనచంద్రశాలలు
ఖచరవిమానసంఘములఁ గలయఁ
జాదుమహార్కిక మణిమయతోరణముల
బహుమనోహరచిత్రసంపదల మహిత
విభవములతోడ నెంతయు విస్తరిల్లు
సురపురం బన హస్తినాపురవరంబు. ౫

చ. అమరులకంటెఁ దత్పురి ధరామరవల్లభు లెక్కుడంట త
థ్యము తలపోయ నాగమవిధానములై తనరారు తారు ని
త్యము నొనరించు దానముల యజ్ఞములం బరితృప్తిఁబొంది
సం, భ్రమమునఁ దేలి వారు వడిఁ బ్రస్తుతిసేయఁగఁ బెంపుఁ
జెందుటన్. ౬

క. రాలెల్లను రత్నంబులు
చేలెల్లను రాజనంబుఁ జెలువొను బౌర
స్త్రీలెల్లఁ బద్మినులు పురి
శ్రీలను నుతియింప వశమె శేషునకైనన్. ౭

సీ. గిరులతెక్కలు ద్రుంచి గిరిభేది భూమిపైఁ
గ్రుమ్మరఁ జనిన మేలొండ లనఁగ
హారుఁ డాకగజమూర్తి నణఁచుట నీనుచే
బహుళగజాకృతులమైఁ బరఁగె ననఁగ

వెలవెల్లఁ బాటించి విడిచెడు గజములు
హరినీలమూర్తుల నమరె ననఁగ
జడధిని గిరులను నడయాడ నొల్లక
మేఘబృందము లుర్వి మెలఁగెననఁగ
నున్నతాకృతి నెంతయుఁ జెన్నుమిగిలి
వందనీయ భద్రస్ఫూర్తి నందమొంది
వినుతసత్త్వంబులను దానవృష్టి మెఱసి
తనరు నప్పురి భద్రదంతావళములు. ౮

గీ. సిరులు మెఱసిన వారణపురములోన
మెలసితిరిగెడుహయములమిసిమి చూచి
యినునితురగంబు లిలఁ గాలుకొనఁగ వెఱచు
వెల్లనై యుండు వేలుపువీటిహయము. ౯

చ. అరదము పూన్పనొక్కఁడెడ నప్పఁడు నెక్కుఁడు..,హయం
బులో, ఖరకరునశ్వముల్ ... ... ...
... ... సూడఁడు నెన్నఁడు నొమరయ్య
య, ప్పురిఁగల యుత్తమాశ్వములఁ బోఁడిగ నెక్కఁడు వా
హకోత్తముల్. ౧౦

క. నవముక్తాతోరణములఁ
బ్రవిమలవజ్రాభిరామభవనముల సుధా
ధవళప్రాసాదంబు ...
... గవిందు ప్రభ నవ్వ్యాటన్. ౧౧

గీ. నెఱయ నప్పురి వజ్రాగ్రనీలమణుల
కాంతిసంగతి నాకాశగంగ యొప్పఁ

జందమున మింటిమీఁదఁ గాళిందితో
... ... ... ౧౨

సీ. ... ... తేనియల్
నిండారఁ దొరగినన
సౌగంధికముల వాసనగల విరినీటఁ
బ్రబలి కైవ్రాలినరాజనములు
నిరుదెసం జెలఁగొందు త ...
... ... ...
... ... ...
చిలుకలు చిందిన ఫలరసంబు
... ... కలును
గలిగి బహిరంగణంబులఁ బొలుపుమిగులు
జనుల కెల్లకాలంబు నామనియొకాఁగ
సాధ్వ......సేయ నలవియగునె. ౧౩

సీ. వా ... ...
... ంబు లెసకమెసఁగ
మెఱుఁగారుతేకులు నెఱదప్పి యొండొంటిఁ
గడవ నందడివడి ...
... ... ...
కుత్తుకకోలఁదులు గ్రోలిగ్రోలి
అన్నా ... ంగమ్మ
పుష్పాడి తివ్వలఁ బొరలిపొరలి
చెలువుమిగిలిన యవ్వీటికోలఁకులందు
దాఁటులైకూ ... ...

... ... ...
మన్ననఁగని వెగడువానిఁ గ్రేళ్ళుదా ౧౪

సీ. రాజితపుష్పపరాగంబుఁ బరఁగించు
మదభృంగమోహనాస్పదత గాంచి
రమణీయు ... ...
... కలన మెఱయ
కర్పూరచందన ... ...
ణంబుల నాకర్షణంబుసేయు
వివిధకేళీలోల విటవిటీసురతశ్ర
మంబుల నుచ్చాటనం బొనర్చు
గర ... ...
... నెంతయుఁ గరముతోడ
మంద ... ...
... ... ... ౧౫

వ. అప్పురంబున కధీశ్వరుండు. ౧౬

సీ. లీల వేల్పులనెల్ల నసినవాజిలో
ముక్కంటిగెల్చి విఖ్యాతి
... ... .
... గా నేరాజుతాతతండ్రి
దర ... ... గలంచె
రారాజులబలము నేరాజుతాత
కాలికాలములయందున ...
... ట్టి రాజాన్వయఖ్యాతుఁ డహిత

రాజరాజకిరీటవిభ్రాజిరత్న
కిరణనీరాజనారమ్యచరణుఁ డాది
రాజగుణరాజితుఁడు జనమేజయుండు ౧౭

చ. ... ... శుండాలకే
సరిదైతేయభయార్తదేవగణరక్షాదక్షుఁ డుగ్రారిభీ
కరతేజోనిధి! సర్వసన్నుతకృపాగారంబు ధర్మక్రియా
నిరతుం డాజనమేజయుండు వె ౧౮

వ. ప్రభావతియుం గమలయు నగ్రమహిషులుగా మహనీయరా
జ్యభోగంబు లనుభవించుచుండఁ బ్రభావతికి శతానీకుం
డనుకుమారుం డుదయిం(చె). ౧౯

క. వరపుత్రుఁ గోరి కమలా
తరుణీమణి చాల నియతిఁ దరుణేందుకళా
ధరు నారాధింపంగం
బరమేశ్వరుఁ డొక్కనాఁ డపారకరుణతోన్. ౨౦

సీ. చెన్నొంది ... ...
... ... గుత్తి
జిగిమీఱు వెలిపట్టుచేలసంగడమున
నెరుసార మూఁడువన్నియలచీర
బాగొందెడి పసిండిపచ్చలపదకంబు
డాపున నొప్పారుపాఁపకంకె
తావులుసంగడిఁ
బొల్పుహారు తెల్లని భూతిపూఁత

యమర సతివయు మగవాఁడు నైన వేల్పు
దనపొడవుఁ గలలోన నాదముగఁ జూపి
రమణ మీఱంగ నొక్కయరంటిపండు
నేలజేని తెఱవ కిచ్చె నిమ్మితోడ. ౨౧

వ. అట్టి మేలికలఁ గని యూతణంబునన మేలుకని యయ్యతివ తనప్రాణవల్లభునకుం జెప్పుటయు నతం డుల్లంబున నుల్లసిల్లి నీ కొక్కపుత్త్రరత్నం బుదయించు నని చెప్పి యానందకందళితమానసుం డగుచున్నంతఁ గొన్ని దివసంబులకు నెల మసలిన. ౨౨

సీ. మానినీరత్నంబుమధ్యంబుతోడన
వలుదలై యూరులు చెలువు మిగిలె
సుదతీలలామంబుచూచుకంబులతోన
యాను గప్పారె యొప్పారఁ దొడఁగె
నలినీలకుంతలయంగవల్లికతోడఁ
బలుచగాఁ జెక్కులు పలుకఁబాఱె
శీతాంశుబింబాస్యచెయ్వులతోడన
నలసంబు లయ్యె నేత్రాంచలములు
జలజలోచననడపుల జడను దోఁచెఁ
జామనెమ్మదిఁ గోర్కులు సందడించెఁ
దరుణినాలుక చవులకుఁ నెరవుపడియెఁ
జెన్ను దఱుఁగుచు గర్భదశ్రీకతమున. ౨౩

చ. అలసము లయ్యెఁ జెయ్వులనయంబుఁ బ్రియం బొనరించెఁ
జూడ్కికి, న్నలువును జెంది యుండియు మనఃప్రమదావహ
మయ్యెఁ జన్నుదో, య్వలవెలఁబాఱియుండియు నవీనవిలా

సము చెక్కులందులం, బాలుపెసలారె గర్భమునఁ బోఁడిమి
నయ్యెగురాకుఁబోఁడికిన్. ౨౮

గీ. పడఁతిచనుదోయి హేమకుంభములకంటె
నొప్పు గజకుంభములకంటె నొప్పు ననఁగ
జనులకనుఁబాటు ధాఁకి కండెనొ యనంగ
గర్భసంపదఁ జనుమొన లుక్కు దాల్చె. ౨౯

గీ. నిధుల నన్నింటి నింటింట నెలవుకొలిపి
ధరణిఁ బేదలు లేకుండ నరయఁ గోరు
నేడుదీవుల నేలంగ నిచ్చఁ గోరు
గురుబుధానంద మొనరింపఁ గోరు నతివ. ౩౦

వ. ఇవ్విధంబున గర్భసంపదఁ బెనుపు వహించి నవమాసంబు
లుం బరిపూర్ణంబు లగుడు నంత నొక్కశుభసమయంబున.

క. మారుని గు
మారునిఁ బోల్పంగఁ దగిన మహనీయశుభా
కారు మనోహరతేజః
స్ఫారు వరకుమారుఁ గనియెఁ బ్రమదం బెసఁగన్. ౩౧

క. నిం గాంచిన
యావత్త మహీశుమనమునం దలరంగాఁ
దా వెలయఁజేసి బంధుజ
నావలి కత్యంతశుభము నాపాదించెన్. ౩౨

సీ. మంగళతూర్యసమాజంబునకు మున్న
న(భమున సౌర)దుందుభులు మ్రోసె
వర్తకీమోహననాట్యంబునకు మున్న
నిర్జరీనృత్యంబు నింగిఁ జెలఁగె

నతివలు శోభనాక్షతలు చల్లకమున్న
సురపుష్పవర్షము ల్గురియఁదొడఁగె
బ్రాహ్మణాశీర్వాదరావంబునకు మున్న
యనిమిషకోటి దీవనలు దోఁచెఁ
బొలసి దక్షిణపవనుండు వెలసె దిశల
హవ్యవాహనుఁడు ప్రదక్షిణార్చి యయ్యె
జనవరుఁడు వేడ్కఁ బ్రియ మందె సకలలోక
మోదకర మైన యక్కుమారోదయమున. 30

వ. అట్టి మహోత్సవమున జనమేజయమహీనాథుండు నానావిధ దానంబులుఁ గామితవస్తుత్యాగంబులు బంధమోక్షణంబులు జపహోమంబులు నొనరించి సముచితపరివారుండై కుమారునకుం గమలాకరుం డనునామం బిడిన మొదలిపక్షంబున విదియచందురుం బోలె ననుదినప్రవర్ధమానుం డగుచు ముద్దుఁబలుకులు పచరించుచుండ 31

చ. హృదయము లుబ్బ నొండొరుల కిట్టివిధం బని చెప్పఁబం
పుచుఁ, మృదుమధురంపు టాటలను మేనలరంగను గౌఁగి
లించుచు, నమ్మదితయు నాథుఁడుం గొడుకుముద్దులఁ దేలన
కాని యెన్నఁడు, నమ్మదిని దలంప రంచితరమావిభవోజ్జ్వల
రాజ్యభోగముల్. 32

వ. ఇట్లతిగౌరవంబునం బెనుపం బెరిఁగి సముచితసమయసమాచరితచౌలోపనయనుం డై. 33

సీ. వేదవేదాంగము ల్వివిధపురాణేతి
హాసము ల్తర్కధర్మార్థశాస్త్ర

ములును నాయుర్వేదమును ధనుర్వేదంబు
భరతశాస్త్రంబును బంచబాణ
శాస్త్రంబు కామందచాణక్యభార్గవ్య
కౌణపదంతముఖ్యప్రదీప
భూపాలనయశాస్త్రములు శిల్పిశాస్త్రంబుఁ
గావ్యము ల్లక్షణగ్రంథములును
నాటకంబులు సర్వనానాకశాస్త్ర
పంచమును నలవడఁగ శీలించి దుష్ట
కుంజరరథాధిరోహణకుశలుఁ డైని
రూఢిఁ జెన్నొందె మిగులంగఁ బ్రౌఢి మెఱసి. 34

వ. నవయౌవనంబు నొందుసమయంబున జనమేజయజననాథుం
డు రాజకుమారానీకశేఖరుం డగు శతానీకుని నిజరాజ్యం
బునకు నభిషిక్తునిం జేసి యక్కమలాకరకుమారునకు యౌ
వరాజ్యపట్టంబు గట్టి సమస్తంబు నప్పగించి తానును దేవీ
ద్వయంబును దపోవనంబున కరిగిన. 35

క. లోకోన్నతగరిమ శతా
నీకుఁడు రాజ్యంబు బూనర్ప నెమ్మని యువరా
జై కమలాకరుఁ డురువిభ
వాకరుఁడై యనుదినంబు నన్నుం గొలుచున్. 36

సీ. అంగహీనతయును హరవిరోధము మాని
కనుపట్టు మకరకేతనుఁ డనంగ
వనవాసమును గృష్ణవర్ణత్వమును మాని
విలసిల్లు నిందిరావిభుఁ డనంగ

బహుగుఁజందంబును నొడలికందును మాని
సంపూర్ణరుచి నొప్పు చంద్రుఁ డనఁగ
ఘనపిధానంబును ఖరకరత్వము మాని
తనువు మైఁ బెనుపొందు తపనుఁ డనఁగ
రూపతనుకాంతి లక్ష్మీప్రతాపమహిమ
లఖిలవర్ణనీయంబులై యతిశయిల్ల
యౌవనోజ్జ్వలతరమూర్తి నందమొందు
నఖిలకమలాకరుఁడు కమలాకరుండు. ౩౭

మ. జగదానందవిహార హారమకుటచ్ఛత్రాదిసంపన్న ప
న్నగభూషార్పితభావ భావజకళాన్వి పుణ్యా పుణ్యక్రియా
సుగమాచారగభీర భీరహితతేజోదీవ్యమానక్షమా
గగనాభోగదిశాంత శాంతమదరాగద్వేషగర్వోదయా. ౩౮

క. ఆఖ్యానకల్పితకథో
పాఖ్యానాఖ్యాయికాప్రపంచరహస్య
వ్యాఖ్యానవ్యవహారణ
ప్రఖ్యాతచరిత్ర వికచపంకజనేత్రా. ౩౯

మాలిని. శమదమగుణమోదీ శైవసిద్ధాంతవేదీ
సముచితనయబుద్ధీ సంచితైశ్వర్యసిద్ధీ
యమనియమధురీణా యజ్ఞకర్మప్రవీణా
శమితదురితవేగా సాధితాష్టాంగయోగా. ౪౦

గద్యము. ఇది శ్రీమద్వెన్నెలకంటి సూరనామాత్యపుత్ర హారి
తసగోత్ర పవిత్ర సుకవిజనమైత్రీవిధేయ అన్నయనామధేయ
ప్రణీతంబైన షోడశకుమారచరిత్రంబునందుఁ బ్రథమా
శ్వాసము.

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీమద్విరించితరుణీ
కోమలవీణానినాదకూలంకష వా
గ్భామాభిరామ సుకవి
స్తోమనుతౌన్నత్య యన్నసూరామాత్యా. ౧

వ. అక్కమలాకరుండు, బుద్ధిసహాయ్యుండును వివేకనిధియు
ను గాంతిమంతుండును యశస్కేతుండును గరుణాకరుండు
ను బ్రభాకరుండును జిత్రకేతుండును నీతిమంతుండును
ననుమంత్రితనూజు లెనమండ్రును, భీమభటుండును దీర్ఘ
బాహుండును దృఢముష్టియు విక్రమకేసరియు నను దండ
నాయకతనయులు నలువురును, మతిమంతుండును గళాని
ధియు వసంతకుండు నను పురోహితపుత్రకులు మువ్వురును,
బ్రాణమిత్రులై నిరంతరంబును బరివేష్టించి కొలువ నొక్క
నాఁడు. ౨

మ. చెలులుం దానును వేడ్కమీఱ విలసచ్ఛృంగారుఁడై త
త్పురీ, లలితోద్యానములందుఁ బుష్పితలతాలాస్యంబు లీ
క్షించుచు, న్గలకంఠీభ్రమరీనినాదము లగణ్యప్రీతి సంధిల్ల వీ
నులఁ జేసెఁ జనమేజయాత్మజుఁడు కాలక్షేప మేపారఁ

వ. ఇట్లు వినోదపరాయణుం డై యొక్క శీతలతరుచ్ఛాయాతలంబున నెచ్చెలులుం దానును సుఖాసీను లై యున్న సమయంబున సాధకుం డొక్కరుండు నిశ్చేష్టనరిగి వారలం గని చేరవచ్చిన నక్కుమారుండు వినతి నాతని నాదరించి మీ రెవ్వ రెచటి కేగెద రని యడిగిన.

క. సాధకుండ నేను సుమహా
(సాధి) కు నొకసిద్ధుఁ గొలిచి యతనిపనుపున
సాధింపఁ గడంగియగునద్ధి
సాధింపఁగ నిశ్చయించి చనుచున్నాఁడన్.

సీ. అది యెట్టి దనిన వింధ్యాటవిలోపలఁ
గరమొప్పు శింశుపాతరువుదండఁ
బారావతాఖ్యుఁ డన్నన్న నీశ్వరుపాల
వైదూర్యకాంతి యన్నాలు వ
దీధితి యనియెడు దివ్యరత్నము గల
దావాలు ధరియించి యాతఁ డేడ
దీవులు నేలు నాదివ్యరత్నముకడ
నఖిలసిద్ధులు గల వధిప నేను
వాని నిప్పుడు సాధింప వలనుమెఱసి
యెంతు నసుటయు నలరి మహీశసుతుఁడు
సఖుల నీక్షించి వారలసమ్మతమున
నతనితో నిట్టు లనియె నత్యాదరమున.

దరి
గని
ఘనసారిఁ
నాసదిఁ జా
రయంబున
రాఁడు ము
గుడ.

శా. ఘనున్న మంత్రులుఁ దోడువచ్చెదము నీ కీప్రొద్ద యన్నట్టి ధరిత్రీనాథాత్మజు నిచ్చ మెచ్చుకొనుచుం దివ్యౌషధిశ్రేణితో

నూనంజేసి రసంబు తత్పదములం దొట్టించి యద్రిస్థలీ
యానోదగ్రత వారుఁ దానుఁ జని వింధ్యారణ్యదేశంబునన్.

గీ. పాంసుసంఛన్న మైనకూపంబుఁ దడవి
దాని చేరువ శింశుపాతరువు క్రింద
నగ్నికుండంబుఁ బొడఁగని యచట నిలిచి
తనసచివులు రక్షకులుగాఁగ నియమమున. ౮

వ. సుస్థిరాసనాసీనుం డై సాధకుండు ఖదిరేంధనంబుల వేల్వం
దొడంగిన. ౯

క. బిగిచన్నులుఁ దెలికన్నులు
నగుమోమును మెఱుఁగుమేను నయనానందం
బగు బద్మనయన యొక్కతె
అక్కమలనేత విభ్రమముతోడ నరుదెంచుటయున్. ౧౦

సీ. గాంతిప వేణికచాంధకారంబుచే
ను ప్రభా మదనాంధకారంబు పొదివికొనఁగ
ననః మంత్రి ారుణాధరయధరరాగంబుచే
భావాండ భావజరాగంబు పట్టుకొనఁగఁ
నాయకతన నేత్రదృగ్జాలంబుచేత ద
ధియుః వసః ర్పకబాణజాలంబు పర్వికొనఁగ
బాణః ుకుచకుచచక్రయుగముచే శంబర
ఇడః రిపుజైత్రచక్రంబు ద్రిప్పుకొనఁగ
నుల్లము గరంగ వైశిక పల్లటిలఁగ
ధైర్య మెడలంగ మంత్రతంత్రములు మఱచి
తలఁపుఁ జూపును నంగనం దగిలియుండ
సంయమభ్రష్టుఁ డై యుండె సాధకుండు. ౧౧

వ. ఇట్లు సాధకుండు కామాతురుం డై మంత్రసామర్థ్యంబు
గోలుపోయిన. ౧౨

క. పారావతాక్షుపనఃపువ
ఘోరతమం బడర భూతకోటులు భయదా
కారత సాధకుఁ బొదివి మ
హారవ మెసఁగంగ నార్చి యాగ్రహమొప్పన్. ౧౩

వ. కడకాలు పట్టి దవ్వులం బడవైచిన వాని వెదక సంభ్రమించి
యందఱు నన్నివంకల నమ్మహాటవి దరియం జొచ్చి వెదకి
వెదకి దిగ్భ్రమనొంది వచ్చిన జాడ యెఱుంగక యొండొరు
లం బొడగానక తిరుగుచుండ భూపాలనందనుండు కొన్ని
దివసంబులు చెలులం దడవి యొక్కనాఁ డొక్క యేటిదరి
నరుగు సమయంబున. ౧౪

ఉ. గ్రాహము తన్నుఁ బట్టినఁ గిరాతుఁ డొకండు ఘనార్తిఁ
గూయుడు, సాహసమార నానృపతినందనుఁ డానదిఁ జొ
చ్చి యుద్ధతి, న్బాహుశితాసి దానివదనంబు రయంబున
వ్రచ్చి బోయ న, వ్వాహిని వెల్వరించుటయు వాఁడు ము
దంబెసఁగంగ నమ్రుఁడై. ౧౫

క. పూని యకారణబంధుఁడ
వై నాప్రాణములు గాచి తసమ్మానకృపాం
భోనిధి నను నీదాసుని
గా నేలితి, రమ్ము నాయగారమ్మునకున్. ౧౬

వ. అని తా నేలెడి కిరాతపల్లికిం దోడ్కొని చని సముచితసం
భావనంబు లొనరించి నిజగృహంబులలో నొక్కరమ్యసద
నంబున నునిచిన నుండి నాఁటినిశాసమయంబున రత్నదీప

ప్రభావిభాసితం బగు తన్నివాసంబు గలయం గనుంగొనున
ప్పుడు దైవయోగంబున. ౧౭

చ. ఒకపురినెమ్మిఁ గాంచి ప్రియ మొదవఁగ బంధము లూడ్చి
పట్టి యం, గకములు దువ్వి దానిమెడఁ గట్టినరజ్జువు గాంచి
వీడ్చినఁ, శకునిసమాకృతిం దొరఁగి చయ్యన భీమభటాభి
ధానుఁడై, ప్రకటవినీతి మ్రొక్కుటయు రాసుతుఁ డద్భుత
మోదమగ్నుఁడై. ౧౮

వ. అత్యంతసంభ్రమంబునం బరిరంభణం బొనరించి యతనిపు
నఃపునఃప్రణామంబు లాదరించి సమీపంబున నునిచికొని
కరఁబు కరంబునం గీలించి నీ కీరూపంబునకుం గారణం బేమి
యని యడిగినఁ గరంబు వినయంబున నతం డతని కి
ట్లనియె. ౧౯

క. ఆపన్నగంబు కతమున
నాపన్నత మిమ్ముఁ బాసి యలజడి నశనా
యాపీడనొంది యుజ్జయి
నీపురముం జేరి మేను నెఱిచెడి తూలన్. ౨౦

సీ. ఏ నొకముదుసలియింటికి నరిగి నా
కాహార మొనరింపు మనుడుఁ బ్రీతి
వెలయించి భోజనవేళయందాఁకను
నది నన్ను శయనింపు మనిన శయ్య
నుండి చూచుచు నుండ నొకకొన్నియవ లది
ధరణిమీఁదటఁజల్లెఁ దత్క్షణంబ
మొలచి గుబ్బన నేచి ఫలియింప సక్తువు
గావించి యదియుఁ బాకంబుచేసి

యొక్కపాత్రంబులోపల నునిచి ప్రాంత
యవలఁ బాకంబుగావించి యదియునొక్క.
కంచమునఁ బెట్టి యొకచీర గప్పి దొంతి
నునిచి యది నీరుదేరంగఁ జనియెనంత. ౨౧

వ. అది కపటకృత్యంబుగా నెఱింగి. ౨౨

గీ. పాత్రముల సక్తువులు పీడుపడఁగఁ బెట్టి
యంబరం బది కప్పినయట్ల కప్పి
యెను శయనతలంబున మేను సేర్చి
కన్నుమూసినపోలిక నున్నయంత. ౨౩

వ. ఆజంత యరుగుదెంచి నేఁ జేసినవిధం బెఱుంగక యత్యంత రయంబున. ౨౪

క. నాపేర నిర్ణయించిన
యాపాత్రము నాకుఁ బెట్టి యవ్వలిపాత్రన్
వేపుచ్చుకొని భుజించుచు
నాపాపపుజంత మేఁక యయ్యె నరుదుగన్. ౨౫

వ. దానిం గనుంగొని నివ్వెఱం గందుచు నాకుం బన్నినయురుల నీవ తగిలితే యనుచు నవ్వుచు భుక్తోత్తరంబున నొక్కరజ్జువున దానికంఠంబు బంధించి తిగిచికొనుచు నొక్కసూనరి గృహంబునకుం జని బట్టి యిచ్చెద ననిన నతనిభార్య యెఱింగి నాచెలియలి నిట్లు చేసితే కాని మ్మని జంకించిన వెఱచి యయ్యజంబు విడిచిపెట్టి దేవాలయంబునకుం జని నిద్రించితి నదియు నదియ వైరంబుగాఁ బాటించి నాచొప్పునం జనుదెంచి యేను మయూరం బగునట్లుగా నిద్రితాడు మత్కంధరాంతరంబున బంధింపంబోలు నేనును బర్హిభావంబు

నొంది బోయలచేతం బట్టువడి యిచ్చటికి వచ్చి దేవరచే
పడి తిర్యగ్భావనిర్ముక్తుండ నై భవదీయదర్శనంబునం గృతా
ర్థుండ నై తి నని పలికి యొక్కవిన్నపం బవధరింపు మని యి
ట్లనియె. ౨౬

సీ. వేగంబ యిచ్చట వెడలంగ వలయుం గి
రాతు లుద్ధతులు ద్వారమున వెడలి
పోవంగం గనుంగొన్నం బోలియింతు రీత్రాటి
వలన మయూరభావములు దాల్చి
యీగవాక్షమ్మున నేగుద మని నృప
తనయుకంఠమున నాత్రాడు గట్టె
నెమలి నై యే యపుడు రాకొమరుండు వెడలి త్రా
డూడ్చి యాతనిచేతి కొసంగుటయును
నాగుణము కంఠమునం గట్ట నాక్షణంబ
తాను బర్హి యై వెడలి రాసూనుచేత
బంధనిర్ముక్తుండై యాత్మభావ మొంది
కడురయంబున నాపల్లె వెడలి వచ్చి. ౨౭

క. తనమతమున కుల్లసిల్లుమహీనాథకుమారుండునుం దానును
గాననమార్గంబున నరిగి యరిగి. ౨౮

క. దళ మగుచీంకటిం దెరువు దప్పి పదంబులు నొప్పిగూరినన్
సొలసి వనంబులోన నొకశుష్కమహీజముక్రింద నుండంగా
లలితనిశాకరాతమహిళాకచభారవిభాసితాబ్జినీ
దళమును బోలి తూర్పుదెసం దారకరా జుదయించె నత్తఱిన్.

చ. నెలవొడువంగం జిత్రముగ నీరసభూరుహ మాకు వెట్టి మొ
గ్గల విరిపూవులం దనరి కాచి ఫలించినం దత్ఫలావళుల్

దళముగ వారు మోదమునం దద్రస మాదటం గ్రోలి దాన
నాఁ, కలియును దప్పియుం దొలఁగఁగా ముద మందుచు
నున్న యంతటన్. ౩౦

గీ. ఆకుజము గుణాకరాఖ్యమిత్రుం డగు
టయును నద్భుతంబుఁ బ్రియముఁ దనర
నర్థితోడ నప్పు డాలింగనము చేసి
యిట్టు లగుటకుఁ గత మేమి యనిన. ౩౧

సీ. ఆపాముకినుకచే నందఱఁ బెడఁబాసి
యడవులలో మిమ్ముఁ దడవి తడవి
యిచ్చోట నొక్కమునీశ్వరుండు సమాధి
నుండు టెఱుంగక యురక నేను
బ్రణమిల్లి చెలులును రాసుతుండు నెచట
నెబ్భంగి నున్నవా రెఱుఁగఁజెప్పు
మనుచుఁ గార్యార్థి నై యందంద ప్రార్థింప
జపవిఘ్నమునకు నాతపసి కినిసి

వట్టితరువవు గమ్మన్న నంత నొంది
వేఁడుటయు నాదరించి నీవిభుఁడుఁ జెలియు
నిచ్చటికి రాఁగలరు వార లేగుదేర
నెలమిఁ బొంది ఫలింతు వా రెలమి నొంద. ౩౨

క. దళముగ ఫలింప నీఫల
ములరసముల వారు తృప్తిఁ బొందుదు నంతేఁ
ఫలవృక్షాకృతి విడుచుచుఁ
జెలువంబుగ వారిఁ గదిసి చెలఁగెద ననినన్. ౩౩

వ. ఆక్షణంబ నీరసవృక్షంబ నైతి దేవర యిచ్చటికి విచ్చేయు
కతంబున శాపవిముక్తుండ నై తావకదర్శనంబున ధన్యుండ
నైతి నిప్పు డప్పరమమునీంద్రుం డెందేని యున్నవాఁ డనినం
దద్దర్శనలాభప్రమోదతరంగితాంతరంగు లగుచు నతఁడును
దారును నొక్కపథంబున నరుగుసమయంబున. ౩౪

క. పాగలు దొడుగుక* యొకయెల
నాఁగయుఁ దానును నభంబునం జని చని భూ
భాగంబున ముగురం† గని
వేగంబున నవతరించి వినతుం డైనన్. ౩౫

## —♦ చిత్రకరుని వృత్తాంతము. ♦—

వ. వీఁడె మనచిత్రకరుండు వచ్చె నిట్టిచిత్రంబునం గలఁడె యని
యుల్లంబున నుల్లసిల్లుచు వానిం బరిపాటి నందఱుం బరిరం
భణం బొనరింప నఁగనయుఁ ముసుంగిడి తొలంగి యుండె
నంతఁ దారొక్కయెడ నాసీనులై యున్నచోఁ గమలాకరుండు
చిత్రకరుని వదనంబునం జూడ్కి నిలిపి నీ కీఖేచరత్వంబు మ
హత్త్వంబు నెట్లు గలిగె నని యడిగిన. ౩౬

మ. అహిరోషంబున నట్లు వాసి చని వింధ్యారణ్యమధ్యంబున
స్సహజస్ఫూర్జితతేజు లిద్ద ఱసురల్ సత్త్వాఢ్యు లేకామిష
స్పృహఁ దర్కింపఁగ వారిఁ జేరఁ జని గంభీరోక్తి వారించి దు
స్సహవాదంబున కెద్ది హేతు వనిన న్స్వాంతోరుసంరంభు లై.

వ. ఒక్కపాత్రంబును నొక్కలాతంబును నొక్కపాగదోయినిం
జూపి. ౩౭

* పాగలు దొడికొని † ముగుఱఁగని-శబ్దరత్నాకరము.

శా. ఈపాత్రంబు నిరంతరేష్టఫలదం, బీసుష్టి ప్రాయంగ నే
ధూపంబైనను నిక్కువంబ యగుఁ, జేరుం గోరుచో టన్న
రుం, డీపాగ ల్దొడినప్డు, మత్పితృధనం బీవస్తువు ల్వీనికై
కోపంబారఁగఁ బోరఁగావలసె మాకుం బాలువోకుండుటన్.

క. అనుటయు నతిమత్సరతం
బెనఁగెడు వారలను గాడుపెట్టి పఱచి కై
కొనియెద నీవస్తువు లని
మనమున నూహించి చతుర(మత) మేపారన్. ౪౦

క. ఇరువురు సంగడి విడువక
పరువునఁ జనుచోటఁ గడవఁబాటెడువాఁ డీ
వరవస్తువులకు నొడయఁడు
సరభసగతి నరుగుఁ డనిన సమ్మదమొదవన్. ౪౧

క. ఏ విడువఁగ సమసత్త్వులు
గావున నొండొరులఁ గడవఁగాఁ జాలక యా
దేవారులు ద వ్వరిగిన
నావలఁ బాఱి రని నెమ్మనమున నలరుచున్. ౪౧

క. త్వరతో యష్టియుఁ బాత్రయుఁ
గరమునఁ గబళించి పాదుకలుదొడి యేనం
బరగతి...నా యంజక
పురమున కరిగితిఁ గుమారపుంగవ వినుమా. ౪౩

క. అందొక్కవృద్ధకామిని
మందిరమున విడిసి తదభిమతధనములు పెం
పొందఁగ నిచ్చియు నప్పురి
యందొప్పెడుకాంత గలదె యనియడుగుటయున్. ౪౪

ఉ. రత్నరథుండు దానసురరత్నము మాపురిరాజు తత్సుతా
రత్నవతీసమాఖ్య హరిరత్ననిభాలక బోలుకన్యకా
రత్నము లేదు లోకమున రాజితలీలల నెప్పునందు నా
రత్నగృహంబునం దనుచు రాసుత యుండెడు మేడఁజూపినన్

వ. నాఁటినిశాసమయంబున మదీయపాదుకామహానుభావంబునఁ దదీయసౌధంబునకుం జని రత్నకళికాలోకం బగు తదంతరంబున. ౪౬

క. తొంగలిఱెప్పల మెఱుఁగులు
తొంగలిగొనుమేను వదనతోయరుహంబుల్
రంగారఁ దల్పమున స
య్యంగన నిద్రింపఁజూచి యాత్మగతమునన్. ౪౭

క. నాగతి మున్ను నెఱుంగదు
నేగతి మేల్కనుపువాఁడ నీసతి నిద్రా
రాగము లగుచూపుల నను
రాగము వొడమునొ యమర్షరాగ మొదవునో. ౪౮

ఉ. అగ్గల మైనమోహమున నల్లన నేనొకయింత డాసినన్
దిగ్గన మేలుకాంచి సుదతీమణి వింతదనంబులేక తా
నిగ్గులుమీఱు కిన్నుఁగవ నెయ్యపుఁ జూపులు సందడింపఁగా
డగ్గఱునేని నాకు నిట దక్కు మనోభవరాజ్యసంపదల్. ౪౯

క. అనుచుండ సౌధపాలుఁడు
తన ప్రియ కొకకథను జెప్పి తద్వేళకు నా
కనుకూలంబై కడునిం
పెనయంగా నొక్క పద్య మి ట్లని చదివెన్. ౫౦

ఉ. లాలితరూపయౌవనవిలాసమనోహర మైతనర్చు నీ
లాలక నిద్రవోవఁ గని యాదటఁ గౌఁగిట మేలుకన్నఁగాఁ
జాలక యాత్మఁ దక్కిన విచారములొంపఁగ నూరకుండ నా
కూళఁడు కామరాజ్యమునకు న్వాలిగాఁడె తలంచిచూడఁగన్

క. అనుపలు కుపదేశముక్రియ
ఘనమోదము నిగుడఁజేయఁ గదిరెడుతమకం
బునఁ గౌఁగిలించి యమ్మా
నిని మెలుపారంగ నేను నిద్ర దెలిపినన్. ౫౨

క. చంచలనేత్రము లమరఁగ
సంచలతయు సమ్మదంబు సంశయము మది
న్మించిన హ స్తస్వ స్తిక
కంచుక యగునింతియొప్పు గడుసలరింపన్. ౫౩

ఉ. ఇచ్చ జనించువేడ్క నొకయించుక వింతదనంబు సేయమిన్
మచ్చిక లేక యుండియును మచ్చిక లగ్గల మైనపోలికిం
బొచ్చెము లేనిసౌఖ్యములఁ బొందితి మేము రహస్యవేళలం
బచ్చనివింటిదేవరప్రభావము భావములం గరంపదే! ౫౪

వ. ఇట్లయ్యింతియు నేనును నత్యంతమోదంబునం గంతునిం గృ
తార్థునిం గావించి తదనంతరంబ. ౫౫

క. నావృత్తాంతముఁ బేరును
నావెలఁదికిఁ జెప్పి రాత్రి యంగనతోడన్
భావజకేళిం దేలుచు
నావిడిదల దివసవర్తనంబు గడుపుచున్. ౫౬

ఉ. ఇప్పగిది రహస్యముగ నే నొనరింపఁగ బోటు లొక్కనాఁ
డప్పువుఁబోఁడిచన్నుఁగవ నంగజముద్రలు గాంచి రాజుతోఁ

జెప్పకయున్నఁ ద ప్పనుచు శీఘ్రమునం జని యేకతంబునం
జెప్పినఁ గూఁతులాగునకుఁ జి త్తములోపల వంత మీఱఁగన్.

చ. తనసుతవర్తనంబు విదితంబుగ నారయఁ బ్రోడ నొక్కఁ బం
చిన నది యేగుదెంచి యొకచెంగట నుండి రతాంతవేళ మా
నినియును నేను మైమఱచి నిద్దుర వోవఁగఁ జూచి ప్రోడలీ
ల నెఱయ నాదుచేలమున లత్తుకరేఖలు వ్రాసె నచ్చుగన్.

క. అంబుజముఖి యిటు లడిరియా
శింబులు గావించి చెప్ప లాక్షాంకసమే
తాంబరుఁ బుఱిఁ దడవుండు ర
యంబున నని రాజు భటచయంబుం బనిచెన్. ౫౯

వ. అవ్వృత్తాంతం బంతయు రాజసదనాంతర్వర్తిని యగు నావృ
ద్ధజంతచేత విని యచ్చట నునికి యకార్యం బని నిశ్చ
యించి పాదుకాసమన్వితపాదుండ నై పాత్రయు లాతంబు
నుం గొని యాక్షణంబ కమలాక్షి యున్నసౌధంబునకుం
జని సకలంబు నెఱింగించి గమనోన్ముఖుండ నగుటయు ని
న్నుం బాసి నిమేషం బైనను బ్రాణంబులు నిర్వహింపనేర
నీతోడన వచ్చెదఁ దోడుకొనిపొమ్మనిన నిమ్మగువం గరం
బులం బొదివికొని గగనగమనంబున వచ్చి వచ్చి యిచ్చట
దేవరం గాంచి యానందకందళితభావుండ నగుచు నవతరిం
చితి ననుచు విన్నవించి. ౬౦

గీ. భక్ష్యభోజ్యలేహ్యపానీయచోష్యముల్
సంకుమదపటీరచంద్రమృగమ
దములు పాత్రమహిమఁ దక్షణమాత్రన
పడసి నెచ్చెలులకుఁ బతికినొసఁగి. ౬౧

వ. మఱియు నక్కుమారు నాలోకించి. ౬౨

క. నాయష్టిమహత్త్వంబున
నీయెడ దేవరకు నుండ నిరవుగ సకల
శ్రీయుత మైతగుపట్టణ
మాయతముగ వ్రాయువాఁడ నని యుత్సుకుఁ డై. ౬౩

సీ. మణిహేమవిస్తారమందిరప్రాకార
సౌధదేవాలయసంచయములు
ఘనసత్త్వబంధురగంధర్వసింధుర
దుర్దమసుభటసందోహాళములు
వరధరణీదేవ వైశ్యశూద్రాదినా
నాజాతు లైనజనావళులును
నిరుపమలావణ్యసురుచిరగుణగణ్య
పణ్యపుణ్యాంగనాప్రకరములును
సన్నుతగృహోపవనములు సర్వనిధులు
నెఱయ వ్రాసిన నన్నియు నిక్కువంబు
లై త్రిలోకీపురీరాజ్య మనఁగఁదగిన
పట్టణము వొల్చెఁ గన్నులపండు వగుచు. ౬౪

వ. ఇట్లు చిత్రంబుగాఁ జిత్రకరుండు పురంబు నిర్మించి దానికిం జిత్రపురం బని పేరిడి యందు రాజమందిరంబునఁ గమలాకరకుమారుని సింహాసనాసీనుం గావించి తానును భీమభటుండును గరుణాకరుండును, సముచితప్రకారంబులం గొలుచుచు మణికనకభాసురనివాసంబుల విశిష్టవిభవంబుల నుల్లసిల్లుచున్నంత. ౬౫

చ. చెలువుగ నొక్కలాతమునఁ జిత్రకరాఖ్యుఁడు పట్టణంబుగా
వలసినయట్టిరూపములు వ్రాయఁగ నన్నియు నిక్కువంబులై
యలవడఁ దత్పురీరమణుఁడై కమలాకరుఁ డన్విభుండు భూ
వలయము నేలఁజొచ్చె ననువార్త జగంబుల నెల్ల మ్రోసినన్

క. ఎసఁగిన యీవార్తలు విని
మసలక వేకదలి కాంతిమంతుండును బు
ద్ధిసహాయుండును మోదం
బెసఁగంగా నరిగి యానృపాగ్రణిఁ గనినన్. ౬౭

క. ఆసిచ్చెలులం గని యా
స్థానంబున నున్నమంత్రితతియును దానుం
మానవపతి యెదురుగఁ జని
మే నలరం గౌఁగిలించి మించినవేడ్కన్. ౬౮

వ. సింహాసనంబు చేరువ సముచితాసనాసీనులం గావించి వారి
వదనంబు లవలోకించి. ౬౯

గీ. మమ్ముఁ బాసియరిగి ... ...
దత్తుఁడనురాజుపురిఁ జేరి తత్తనూజుఁ
డగు విజయసేనుతోడ సఖ్యమ్ముచేసి
యుచితవృత్తిమైఁ దిరుగంగ నొక్కనాఁడు. ౭౦

క. ఆనృపనందనుసోదరి
మానసభవురాజ్యలక్ష్మి మదిరావతి య
న్మానవతీతిలకం బు
ద్యానవిహారంబు సలుప నరిగెడువేళన్. ౭౧

క. విలసితమారాళరాజీ
కలకల మెసఁగంగ మెలఁగు కమలిని వోలెం

గలనూపురకాంచీమం
జులరావము లెసఁగ నింతి చూడ్కికి నబ్బెన్. ౭౨

క. హారావళిలో నయ్యం
భోరుహాలోచనకుచాగ్రములు గనుపట్టెన్
శారదనదిఁ గానంబడు
హారిసరోజాతకుట్మలాగ్రములగతిన్. ౭౩

ఉ. అవ్వనజాక్షిఁ జూచి హృదయంబున రాగము నివ్వటిల్లఁగా
నివ్వెఱఁగంది తెప్ప లిడనేరక చూడఁగ ధైర్యమూలముల్
ద్రవ్వెడుచూపుల న్వికచతామరసానన చూచె నామదిం
గువ్వలుకాఁడు దట్టముగఁ బుష్పశరంబులఁ దూఱనేయఁగన్.

క. పులకలుఁ జెమరును గంపము
నెలకొన నొకమాటునందు నిలిచితి నేను
జ్జ్వలపుష్పబాణబాణా
కులిత యగుచు నెట్టకేనిఁ గోమలి చనియెన్. ౭౪

వ. ఏనును మీనకేతనోదారశరాసారవిదారితమానసుండ నగు
చు విజయసేనుం గొలువ నరిగి యవసరం బగునంతకు నగ
రిలో నొక్కెడ వసియించి మదిరావతినిం జింతింపుచున్నంత
నన్నాతి యుపమాత గనుంగొని కన్నుసన్న నన్నుం జేరి
ధవళాంబరంబునం బొదివినకందుకంబుచందంబున నున్నపూ
దండ నాకుం జూపి యి ట్లనియె. ౭౫

క. ఏమితపం బొనరించితొ
భామ మదిరావతి ప్రియంబు మదిఁ గదురంగాఁ
దా ముదముతోడఁ గట్టిన
యీ మాలిక నన్ను నీకు నిమ్మనిపనిచెన్. ౭౬

క. వేయింటికి నీవ మనో
నాయకుఁడవు మేదినీశనందన యని తా
నాయుజ్జ్వలదామంబును
నాయఋతం బెట్టి నాననము వికసిల్లన్. ౭౮

క. ఆలలన తాన కట్టిన
మాలిక ధరియింపఁ దద్రమణీకరముల గా
ఢాలింగన మొనరించిన
యాలా గొందుటయు సుఖమయాత్ముఁడ నైతిన్. ౭౯

వ. అ ట్లత్యంత మోదాయత్తచిత్తుండ నై యన్నాతి నన్ను వరి
యించు నని యున్నంత. ౮౦

క. జగతీపతి తనపుత్రికిఁ
దగువరుఁ డని యొక్కరాజతనయునకుఁ దగ
న్మృగనేత్ర నిచ్చువాఁడై
యగణితశుభలగ్ననిశ్చయము సేయుటయున్. ౮౧

క. అమ్మాట పిడుగుమ్రోఁత వి
ధమ్మునఁ గర్ణములు వగులఁ దాఁకుటయును ను
ల్లమ్ము గడుఁ దల్లడిల్లఁగఁ
గ్రమ్మడు విరహాగ్ని సైఁపరాక తరలఁగన్. ౮౨

వ. అత్తఱి మదిరావతిపుత్తెంచినపరిచారిక యొక్కతె యరుగు
దెంచి నన్నూఱడించి యబ్బోటి తనయాడినమాటలు విను
మని యి ట్లనియె. ౮౩

ఉ. భూమివరుండు తన్ను నొక భూపకుమారున కిచ్చునంచు నీ
వేమియుఁ జింతఁ బొందవల దీక్రియ నిన్ను వరింతు నెంతయుం

ప్రేమ దలిర్ప నొల్లను వరింపఁగ నామది కియ్యకోలు గా
దామనుజేంద్రుఁ డేల నను నన్యుల కిచ్చె ననాదరంబునన్.

గీ. అనెడుపల్కు సుధాసేక మగుచుఁ జెవుల
నలరఁజేసె డెందంబు కొందలము మాన్పెఁ
జలనమొందిన ప్రాణంబు నెలవుకొలిపె
నూతనాంగజరాగంబు నూలుకొలిపె. ౧౫

వ. అమ్మగువమాటలు విని సమ్మోదమ్మయి నూఱడిల్లి యు
న్నంతఁ గొన్నిదినంబులకు లగ్నదివసంబు వచ్చుటయు.

సీ. రాజనిశ్చితుఁ డైన రాజకుమారకుం
డభినవవిభవంబు లతిశయిల్ల
ననమానమణితోరణాలంకృతం బైన
రాజమార్గంబున రమణతోడ
నానావిధవిభూషితానేకజనములు
చెలువారఁ దనచుట్టు బలసికొలువఁ
గనకహర్మ్యము లెక్కి కామినీజనములు
తనమీఁద శేషాక్షతములు చల్ల
వివిధశోభనవాద్యము ల్విస్తరిల్ల
నతులవందిమాగధజనస్తుతులు చెలఁగఁ
బ్రీతి మదిరావతీకన్యఁ బెండ్లియాడ
వైభవోన్నతు లలరార వచ్చుటయును. ౧౬

క. ఏ నావిభవము గనుఁగొని
మానసమునఁ జాలఁ గుంది మదిరావతిపై
నూనిన యాస విడిచి యతి
దీనతఁ బురి వెడలి పోయి ధృతి మాలివెసన్. ౧౭

క. కాయజవేదన కోర్వక
కాయము విడువం గడంగఁగా దైవగతిక
నాయున్నయెడకు బుద్ధిస
హాయుఁడు వచ్చుటయుఁ గాంచి హర్షం బెసఁగన్. ౮౯

వ. గాఢాలింగనం బొనరించి వృత్తాంతం బంతయు నెఱింగించి నం జింతింపవలదు నీహృదయవల్లభ నీక సిద్ధించునుపాయం బు గలిగెడు నని యూఱడించి నీపడినయట్ల యేనునుం బడితి నాకథ వినుమని యి ట్లనియె. ౯౦

గీ. అట్లు వింధ్యాద్రి మిముఁ బాసి యరిగి యేను
బెక్కుగహనంబులు తరించి యొక్కయడవి
నిందిరామందిరం బయి యందమందు
శంఖపాలాఖ్య నొప్పారు సరసిపొంత. ౯౧

క. పలువురుబోటులతోడను
జలకేళి యొనర్ప వేడ్కఁ జనుదెంచిన యు
జ్జ్వలయావనై కవసతిని
విలసితరూపవతి నొక్కవెలఁదిం గంటిన్. ౯౨

క. అంగనకబరీమేఘము
నంగతటిద్ద్యుతియుఁ జూచి యనురాగముతో
నంగజుకేళిమయూరము
భంగిని సమ్మదవిఘూర్ణభావుఁడ నైతిన్. ౯౩

క. ఆకాంతయు నన్నచట వి
లోకనములఁ జూచుచుండె లోలాత్మక యై
యాకొలనివంక నొక్కమ
హాకరి యచ్చటికి వచ్చె నంభోవాంఛన్. ౯౪

మ. గళదుద్యన్మదరంజితభ్రమరరేఖం గాలకూటచ్ఛవిః
కలితోదంచితమందరంబువిధమై కర్ణానిలాలోలదీ
ర్ఘలసన్నిర్మలచామరంబుల బలాకావేష్టితాబ్దంబునా
నలి గరిల్లెడు నాగజంబుఁ గని కాంత ల్పొందలం బందఁగన్.
వ. ఓడ కోడకు మని యమ్మానినిం జేర నరుగుటయు. ౯౬
క. అతిభీతిరాగయోగో
ద్ధతకంపచ్ఛేదపులకితప్రసభనము
న్నతకుచము లురము గాడఁగఁ
నతివ ననుం గౌఁగిలించె నతిరభసమునన్. ౯౭
చ. కనుకలిఁ జిక్కి యేను బిగికౌఁగిటఁ జేర్పఁగఁ గోరునాసరో
జనయన యప్డు కుంజరమిషంబునఁ బైఁబడి యిట్లు కౌఁగిలిం
చినఁ బులకించి యిట్టి దని చెప్పఁగరాని సుఖంబుఁ జెప్పిన
న్నను నెఱుఁగంగనేరక మనంబున నేన కరంగుచుండితిన్.
వ. ఇవ్విధంబున నభినవసౌఖ్యంబు లనుభవించి యే నయ్యేనం
గు నుద్దేశించి. ౯౮
ఉ. ఓకరిరాజ నీకతన నుత్పలలోచన దాన వచ్చి న
న్నేకొని కౌఁగిలించె వికసిల్లుచు నిట్టిపరోపకారికి
న్నీకుఁ బ్రియాసమాగమము నిచ్చలుఁ గావుతఁ దత్కరో
ల్లస, చ్ఛీకరశీకరప్రకరసేకసుఖంబులు నివ్వటిల్లఁగన్. ౧౦౦
వ. అని దీవించితిం దదనంతరంబ యాసామజంబు నపారాశుసీ
త్కారపూరితశీకరాసారమండితం బైన కరదండం బొర్చు
చు నామీఁదన కవిసిన నయ్యింతి నోసరిలం జేసి. ౧౦౧
క. కరికరము పట్టికొని

వెరవుమెయి దాఁటి యరిగితి
మరలి కనుంగొనకమున్న మహితరయమునన్. ౧౦౨

క. ఏను గరి కడ్డుపడునా
లోనన నెచ్చెలులు పద్మలోచనఁ గొనుచుం
గాననము దరిసి రెచ...
... ... ... ౧౦౩

వ. .........రంబ ప్రవేశించి యున్నంత దంతావళంబు సరః
ప్రాంతంబున నెంతయుం దడవు విహరించి యది తొలంగి
చనుట యెఱింగి యయ్యెడ వెడలి యయ్యెలనాఁగ చనిన
వలని......బున. ౧౦౪

ఉ. ఆవనజాక్షి నేవలన నారసి కానక యాతురుండ నై
భావజవహ్నిఁ గ్రమ్మికొని భావము గాల్పఁ జరించునంత రా
జీవవిరోధిమండలము చిచ్చుఱపిడుగును బోలె నన్నుఁ
... ... ... ... చున్. ౧౦౫

వ. అప్పు డేపారు మదనానలతాపంబున కోర్వక మరణోద్యు
క్తుండ నై యాంగికంబు లగుశుభసూచకంబులు గల్గిన నం
గనం గనుంగొనియెద నను......డ నై పెక్కడలం జరించి
యిక్కడకు నరుదెంచి నిన్నుఁ గాంచితి నని తనవృత్తాంతం
బుఁ జెప్పిన యనంతరంబ మనోభవాధీనమానసుండ నై న
న న్నూఱడించి యి ట్లనియె. ౧౦౬

క. ... ... ...
... ... ... ముసుగుడికిం
జని లో నొక్కెడ నుండఁగ
మనకోర్కి ఫలించు నిచట మసలఁగ నేలా. ౧౦౭

క. అని పలికి నన్నుఁ దోడ్కొని
చనఁగా నిరుపురముఁ బుష్పసాయకుగుడికిం
జని గర్భగృహంబున న
మ్మనస... ... ... ౧౦౮

వ. ... ... యంబునం గరదీపికాసముదయంబు వె
లుంగ నాందోళికారూఢ నై యమందవిభవంబున. ౧౦౯

క. ఘనవాద్యఘోషభీషణ
జనవననిధినడుమ లక్ష్మిసరణి నమరుచుం
జను ... ...
... ... ... నంగజుగుడికిన్. ౧౧౦

గీ. వచ్చి చెలువందఁగా నెల్లవారి నిలిపి
యొక్కతియ గుడి సొచ్చి చిత్తోద్భవునకు
మ్రొక్కి కరకమలంబులు మోడ్చి నిలిచి
కన్నునీ రొల్క ని ట్లని విన్నవించె. ౧౧౧

క. అగణితవిలాసు నొక్కని
... ... ... ...
... క వేఱ యొక్కని
మగఁ డని తగిలింపఁ దగునె మనసిజ నీకున్. ౧౧౨

క. ప్రాణేశవిరహ మోర్వం
బ్రాణము విడిచెదను మీఁదిభవమున నైనం
బ్రాణేశ్వరుఁ గందు రతి
ప్రాణే... ... ... ౧౧౩

వ. నిర్భరతరం బగుసాహసంబున గర్భగృహంబు సొచ్చి కంఠం
బున నురి యిడుకొనుటయు. ౧౧౪

క. బాలిక డగ్గఱి యెత్తి కు
చాలింగనపులకదళిత మగుకేల మెడం
గీలుకొనిన యురి వుచ్చిన
నాలోకించి నను నెఱిఁగి యాసమయమునన్. ౧౧౫

క. ఆనందకంపలజ్జల
నూనినమదితోడ వెచ్చనూర్చుచు నయ
బ్జానన సబాష్పగద్గద
యై నన్నుం గౌఁగిలించె నత్యనురక్తిన్. ౧౧౬

వ. అట్లు ప్రియాలింగనసౌఖ్యతరంగితాంతరంగుండ నై యాకు
రంగలోచనం గనుంగొని. ౧౧౭

క. వనజాతనేత్ర యడలకు
నిను వెరవునఁ గొనుచుఁ బోదు నిమిషములోనన్
మనపాలి పుణ్యదేవత
మనసిజుఁ డిచ్చోటఁ గూర్చె మనలం గరుణన్. ౧౧౮

వ. అని యూఱడించు సమయంబున బుద్ధిసహాయుండు నన్నుం
గనుంగొని యిట్లనియె. ౧౧౯

చ. వెలఁదుకభూషణంబులును వేషము నచ్చుపడంగఁ దాల్చి యే
వెలువడి పెండ్లికన్యయన వేడుక నందల మెక్కి యేగదం
గలజను లెల్లఁ బాఱు వెనఁ గామిని దోడ్కొనిపోయి యంబికా
నిలయములోన నుండు మని నేర్పున ధైర్యము విస్తరిల్లఁగన్.

చ. కచభర మూడ్చి నుందురుముగా నిడి మించినపూవుగుత్తు
లం, గుచములు గాఁగఁ గట్టుకొని కోమలి భూషణవస్త్ర
మాలికా, ప్రచయము దాల్చి మీసములు రాని మొగం

బునఁ గాంతియొప్పఁగా, నచలగతి న్ముసుంగిడి లతాంగిగతి
న్వాలి కల్ల నేగినన్. ౧-౨౧

వ. పరిజనంబులు సంభ్రమంబున నెద్దియు నెఱుంగక యాందో
ళిక యెక్కించుకొని క్రందుకొనం గొలిచి యందఱు నరిగిన.

క. మదిరావతిఁ దోడ్కొనిచని
మదిరాగం బెసఁగ దుర్గమందిరమున నె
మ్మది రాగిల్లుచు నుండఁగ
నది రాజ్యముకంటె నాకు హర్షముచేసెన్. ౧-౨౩

వ. అట్లుండునంత బుద్ధిసాహాయ్యుండు మూఁడవజామునఁ బ్రి
యకామినీసహితుం డై యచ్చటికి వచ్చిన నచ్చెరు వంది
పిచ్చలించుచునున్న యంతరంగంబు లలర గాఢాలింగనం
బాచరించి యిచ్చెలువ యెచ్చట నీకుం జేకుఱె ననిన హాస
భాసితవదనుం డగుచు ని ట్లనియె. ౧-౨౪

ఉ. ఏ వనితాకృతి న్నగరికేగి నృపాత్మజయుండునట్టి య
య్యోవరి కేగి తల్పమున నొప్ప ముసుం గిడి యున్న యంత
న, న్నావరకన్యఁగాఁ దలఁచి పొల్తుకయొక్కతె చేరవచ్చి
తా, నావనజాక్షి చిత్తగతి యంతయు మున్న యెఱుంగుఁ
గావునన్. ౧-౨౫

వ. ఎవ్వరు వినకుండ నల్లన ని ట్లనియె. ౧-౨౬

ఉ. వందఁగనేల యిట్లు వలవంత దొఱంగుము రాజకన్యకుం
బొందఁగవచ్చునమ్మ తనబుద్ధికి వచ్చినవానిఁ దండ్రి యా
త్మం దలపోసి యిచ్చినయతండు వరుం డని యుండు నెమ్మితో
నందనిమ్రానిపండులకు నఱ్ఱులు సాఁపరు పద్మలోచనల్.

క. ఈవేగుజాము పెండిలి
యీవిధమున నుండు టుచితమే తలపోయన్
భావజవహ్నా యడంగెడు
భావంబున ధైర్య మింత పట్టుకొలుపుమా. ౧౨౮

క. మానసభవుశిఖ వేఁడిమి
యే నెఱుఁగనె దీని ననఁగ నేఁటికి విరహ
గ్లానిం గుందుచు మానిని
గానేరక యున్నదాన గమలదలాక్షీ. ౧౨౯

గీ. శంఖపాలాఖ్య నొప్పారుసరసి పొంత
మన్మథాకారు నొక్క-(కుమారు)ఁజూచి
యుల్ల మలరంగఁ జేరుచో నొకగజంబు
విధివశంబున మముఁ బాపె వీఁకఁ గదిసి. ౧౩౦

క. కరి ప్రాణేశ్వరుఁ బాపిన
విరహమునకు నోర్వలేక వేఁదురునై యా
మరుఁడు దగిల్చిన చిచ్చున
నరిసెద నదిమొదలుగాఁగ నుత్పలనయనా. ౧౩౧

క. నావుడు మత్ప్రియఁగా మది
భావించి మునుంగు వుచ్చి భావం బలరన్
నీవల్లభుఁడను నే నని
నావృత్తాంతంబుఁ జెప్పినం దెలిసి తెసన్. ౧౩౨

క. అంగము తాపము వాయఁగ
నంగన ననుఁ గౌఁగిలించి యాత్మగరంగం
బొంగెడునాదెనఁ గనఁగొని
యంగన యిట్లనుచుఁ బలికె నతిమృదుఫణితిన్. ౧౩౩

క. ఈమదిరావతితల్లియు
నామాతయుఁ దోడఁబుట్టినా రట్లగుటన్
భూమీశునాజ్ఞఁ బెండ్లికి
నే ముదమున వచ్చి కంటి నిచ్చట నిన్నున్. ౧౩౪

వ. అని చెప్పిన నత్యంతసంతుష్టాంతరంగుండ నై మదిరావతీ కల్యాణనిమిత్త మదిరాపానమత్త పరిజనప్రతీహారద్వారపాలాదుల వంచించి వచ్చితి నని చెప్పిన నుప్పొంగుచు నీప్రొద్ద కదలి యిద్దఱము నన్నార్థుల(?)మై యింతులం దడవికొని కాంతారమార్గంబున నరుగుదెంచి యిచ్చట దేవరం గాంచి కృతార్థుల మైతి మని చెప్పిన నద్భుతరసాయత్తచిత్తుం డయ్యెఁ దదనంతరంబ. ౧౩౫

క. ఆనరనాయకుఁ డత్తతి
నేనిక వేఁటాడ దూర మేగి యొకమహా
కాననములోన దుర్గా
స్థానముఁ గని యచటఁ జేరఁ జనియెడునంతన్. ౧౩౬

—♦ వసంతకునికథ ♦—

క. పరమేశ్వరి కతిభక్తిని
నరబలి యొనరింప వచ్చినకిరాతులు త
న్నరపాలునిఁ గని పట్టిన
నరుల విడిచి భీతిఁ గాననముఁ దూఱుటయున్. ౧౩౭

క. బుద్ధ్యధికుండు వసంతకు
వధ్యశిలాగ్రమునఁ గాంచి వసుధాధీశుం
డధ్యానందుం డగుచున్
విధ్యనుకూలతకు నాత్మ వికసిల్లంగన్. ౧౩౮

క. తనమంత్రులుఁ దానును వా
హనములు వే డిగ్గి చేర నరిగి యతని బం
ధనము లెడలించి యాలిం
గనముల నొనరించి యపుడు ఘనమోదమునన్. ౧౩౯

వ. అతండును దానును సముచితోపాయనంబు లిచ్చి దేవికి సా
ష్టాంగదండప్రణామంబు లాచరించి శీతలతరుచ్ఛాయ నాసీ
నులై యుల్లాసంబున నతం డడుగఁ దమవృత్తాంతం బెఱిఁ
గింపఁ దదనంతరంబ వసంతకుండు కరయుగంబు మొగిచి
మహీకాంతున కిట్లనియె. ౧౪౦

## —♦ రూపిణికథ ♦—

క. భూరమణ నిన్ను వెదకుచు
ఘోరాటవిలోనఁ దిరుగఁ గొందఱుచోరుల్
క్రూరత మీఱఁగ నొకబే
హారిధనంబు హరియింప నతఁ డాతురుఁ డై. ౧౪౧

క. మొఱ వెట్టఁగ నావైశ్యుని
వెఱ వంతయుఁ బాపి చోరవీరులనెల్ల
న్నుఱుమాడి యాతఁ డెంతయు
వెఱఁ గందఁగ సొమ్ము లెల్ల వెస నొసఁగుటయున్. ౧౪౨

వ. అత్యంతసంతోషంబున నతండు వినతుం డై నన్ను బహు
విధంబులం గొనియాడి మదనోల్లాసం బనుతనపురంబునకుఁ
దోకొనిపోయి యుపాారధనంబు లిచ్చి సంభావించె నప్పురం
బు బహువిధవినోదాస్పదంబు. ౧౪౩

సీ. శుకుఁ డైన నవ్వీటిజోటులఁ జూచిన
భంగంబు నొందు దర్పకునిచేత

శివుఁ డైన నప్పురిచెలువలఁ జూచిన
మరు లొందు భావసంభవునిచేత
శరజన్ముఁ డైన నప్పురికామినులఁ గన్న
రాగాంధుఁ డగు రతిరాజుచేత
వరదుఁ డైనను నన్నగరకాంతలను గన్న
మదనాతురుం డగు మదనుచేత
బ్రహ్మచర్యంబులకు నెల్లఁ బాయుదెరువు
వివిధనియమంబులకు నెల్ల వీడుకోలు
మహితభోగంబులకు నది మందిరంబు
ల............న్మథోల్లాసపురము. ౧౮౮

సీ. హాటకహర్మ్యంబు లంగ రేఁకులవారు*
పరిచారికావళి భటచయంబు
స్మరబంధచిత్రము ల్పకినలమంచము
ల్పరువు గీరంబులుఁ బారువంబు
లాలవట్టంబులుఁ గీలుబొమ్మలు మంచి
పైఁడిపన్నీరులుఁ బట్టుతెరలు
నిలువుటద్దములు గంటలయుయ్యాలలు హంస
తూలికపాన్పులు దోమతెరలు
సారమృగమదకర్పూరచాదనములు
లలితచీనాంబరాదులు పొలుపు మిగిలి
చెలువు మీఱ మనోహరశ్రీల మెఱసి
యొప్పుదురు వారకామిను లప్పురమున. ౧౮౯

* యీపద్యము మూఁడవయాశ్వాసములో నున్నదని - శబ్దరత్నాకరము.

వ. ఇట్లు మనోహరంబై యొప్పునప్పురంబున నుండి యొక్క
నాఁడు దేవాలయంబున కరిగి రూపిణి యనునర్తకీనృత్యంబు
చూచుచుండ నయ్యంగన నన్నుం గనుంగొని యంగజాయ
త్తచిత్తయై తనయనురక్తి చెప్పి నాపాలికి దూతికం బుత్తెం
చిన నది ప్రార్థించి తోడ్కొనిపోవఁ దత్సదనంబునకుం జనిన
నది యనురాగంబున నాతోడి యిష్టోపభోగంబులం దగిలి.

ఉ. మెచ్చదు వీటిలోనఁ బెఱమిండల నెవ్వరుఁ దన్నుఁ గోరి వే
యిచ్చెద మన్న నందికొనసీ దొరయప్పుడుఁ దల్లితోడ నా
యిచ్చిన యీగి సెప్పికొను నెందును బాయుట కోర్వ దా
త్మలో, నచ్చపలాక్షి నన్నుఁ బ్రియమారఁగఁ బొందినయం
తనుండియున్. ౧౪౭

క. ఎడపక నాఁడు న్నాఁటికిఁ
గడునూత్నములై నరతులఁ గౌతుక మొదవం
బడఁతి యలరింప నెక్కుడఁ
బొడిచితె ప్రొద్ద యని యింపు పొంపిరి వోవన్. ౧౪౮

వ. నిరంతరానుమోదంబున నున్నయవసరంబున. ౧౪౯

సీ. జత్తుల వట్టంబు జఱభి మాటలపోతు
పలుగాము డాకిని బందికత్తె
చెడుగు బమ్మెతకత్తె చిక్కొంకి రక్కస
యోడిసి జూదరిక ... ...
... ... ...
... దినంబులు పోరిపోరి. ౧౫౦

క. ఈపగిదిఁ బోరియును నను
రూపిణిఁ బాపంగలేక క్రూరత నొకరే

పాపాత్మక యది నాప్రా
ణాపాయ మొనర్పఁ దలఁచి యతిదౌష్ట్యమునన్. ౧౫౧

క. రూపిణికి నాకుఁ జొక్కెడి
యాపాలఁతుకఁ బాపి యిద్ద ఱతివలచేతన్
మోపించుకొనుచుఁ గొని చని
వే పాఱెడు నీటిలోన విడిచి యరిగినన్. ౧౫౨

క. మోచుకొని యరుగునప్పుడు
చూచుచునుండియును నేను జొక్కుకతమునన్
లేచి చనలేక నదిలో
వైచిన నొక కొంతతడవు వఱద నరుగఁగన్. ౧౫౩

క. అంగంబు నీటిలోన ము
నింగినఁ జొక్కెడలుటయును నెరిఁబడి యేనుం
డంగ వఱదబడి యొకమా
తంగముడొక్క నను జేరె దైవవశమునన్. ౧౫౪

క. ఆయేనుఁగుడొక్కను బా
హాయుగమునఁ బట్టి యెక్కి యగ్రమునందే
నాయతరంధ్రముగాంచి యు
పాయంబున లోనఁజొచ్చి యచలాంగుఁడ నై. ౧౫౫

వ. కొంతతడవునకు నేదదేఱి యున్నంత నాదంతికళేబరంబు నదీ
వేగంబున నంబునిధానంబు సొచ్చిన. ౧౫౬

ఉ. ఒక్కమహాఖగం బెచటనుండియొ యచ్చటి కేగుదెంచి యా
డొక్క నిజాననాయతపుఁ దోరపుఁజంచువున న్వహించి
కొం. చెక్కుడు వీఁకఁ జంక్రమణ మెంతయుఁ దోఁపఁగ

నేగె నత్తఱిఁ, దెక్కలు వీచు ప్రోఁతల నెఱింగితి దాని
మహాఖగంబుగన్. ౧౫౭

వ. అంత నమ్మహాఖగంబు లంకాద్వీపంబునకుం బోయె నప్పు
డక్కరికళేబరంబు ప్రిదిలి ధరం బడిన నేనును బోరున నందు
వెడలి తలచీర యులవరించుకొని యన్నెలవు వాసి నలుదిక్కు
లుం జూచుచు నరుగ నత్యంత శాంతులగు దైత్యులు కొంద
ఱరుగుదెంచి నన్నుం గాంచి నీవు నరుండ విది లంకానగరం
బిచ్చటికి నీవు వచ్చుట యచ్చెరు వని పలికి మమ్మునేలిన
కరుణావిభూషణు విభీషణుం గానుపించెదము రమ్మని తోడు
కొనిపోయి సముఖంబుచేసిన నాపౌలస్త్యుండు చాలం గరు
ణించి సన్నుతుండనైన నన్నుఁ బ్రసన్నావలోకనంబున నిరీ
క్షించి యెక్కడనుండి వచ్చితని యడిగిన నంతలోనన
యొక్కయుక్తిం బొడగాంచి కరంబులు మొగిడ్చి. ౧౫౮

అనఘ జంబూద్వీపమున మదనోల్లాస
    మనఁగ నింపొందు మహాపురంబు
నెలసి యందుల రమాధీశుండు సద్భక్తి
    వరదనామమున సేవకుల కెల్ల
వరము లిచ్చుచు నున్నవాఁ డమ్ముకుందుని
    నత్యంతభక్తి నేనాశ్రయించి
దేవ విభీషణదేవరఁ గాంచు పు
    ణ్యంబు నాకిమ్మని యర్థి వేఁడ
దేవసన్నిధి నిద్రింప దివ్యమహిమ
నెవ్వరో నన్నుఁగొనివచ్చి యిచటనిడిరి

నిఖిలభాగవతాగ్రణి నిన్నుఁ గంటిఁ
బరమపుణ్యుని గాంచిన ఫలముఁగంటి. ౧౫౯

వ. అనిన నెంతయు సంతసిల్లి కనకరత్నమయంబు లగు శంఖ
చక్రంబులును గదాంబుజంబులును దెప్పించి యవి యద్దేవు
నకు సమర్పింపు మని యిచ్చి నాకు దివ్యాంబరాభరణ
మాల్యంబులు నపరిమితకనకంబు ను నొసంగి యురువురు
దైత్యుల రావించి వీని నీవస్తుసంతానంబును భరియించి మ
దనోల్లాసపురంబు సమీపంబున నునిచి రం డని పనిచిన
వారు నన్నుం గొనివచ్చి యన్నగరంబు చేరువ నునిచి మ
గుడ నరుగ నత్యంతమోదాయత్తచిత్తుండ నై నాకిచ్చిన
ధనంబు నొక్కకందువ దాఁచి తత్క్షణంబ. ౧౬౦

చ. కరముల శంఖచక్రములు గైకొని కాంచనరత్నభూషణో
త్కరములు దాల్చి నూతనవికాసమున న్మొయి నివ్వటిల్లఁగా
సరసిజనాభుపోల్కిని నిశాసమయంబున నేను రూపిణీ
వరసదనంబు సొచ్చుటయు వారనివేడ్కలు నివ్వటిల్లఁగన్. ౧౬౧

క. వనజాక్షుఁడు వచ్చె నటం
చనుమోదముతోడ నదియు నమ్మయు సాష్టాం
గనమస్కృతు లొనరించినఁ
గని నాచేఁ జిక్కెరనుచుఁ గౌతుక మెసఁగన్. ౧౬౨

గీ. నేఁడు మొదలుగ వరియింతు నిన్ను నింక
నొరుల్లఁ జేరంగనీ నన నుల్లసిల్లి
పుష్పకోమల యనురక్తిఁ బొందియుండ
మకరదంష్ట్రియుఁ జిక్కె నామాయఁ దగిలి. ౧౬౩

వ. ఇట్లుండ నంత నొక్కనాఁడు దనకూఁతును వేఁడికొని యది
యి ట్లనియె. ౧౬౪

క. ఓకాంత నిన్ను వేఁడెద
నాకమునకు బొందెతోన నను నంపఁగదే
నీకాంతుఁడు శ్రీకాంతుని
నేకాంతమునందు వేఁడి యేక్రియ నైనన్. ౧౬౫

గీ. అనుచుఁ బ్రార్థించుటయుఁ దన యమ్మమాట
నాకుఁ జెప్పిన నే నెమ్మనమున నగుచు
నమ్మకరదంష్ట్రిఁ గాకు సేయంగఁ దలఁచి
దానిఁ బిలిచి యే ని ట్లంటి మానవేంద్ర. ౧౬౬

ఎల్లి యేకాదశి నెంతయు నిష్ఠను
స్నానదానంబు లొనర్చి నీవు
పెడతలం జెంపల నడునెత్తి ముందట
నైదుకూఁక ట్లుండునట్లు గాఁగఁ
దల బోడ గావించి తనువులో సామున
సిందూరము నలంది చేత నొక్క
యుడిదంబుఁ బూని దిగంబరవై రాత్రి
నిచ్చెనఁ దెప్పించి నెమ్మితోడ
నాదుగుడిపొంతఁ జాల నున్నతిఁ దనర్చు
తోరణస్తంభ మెక్కి యెవ్వారు నెఱుఁగ
కుండ నిచ్చెన దప్పించి యుండు మువిద
యట్టు లైనను నేగెద వమరపురికి. ౧౬౭

వ. అనుచుం జెప్పినయప్పలుకులు నిజంబుగా మనంబున నిశ్చ
యించి మఱునాఁడు మద్వచనప్రకారంబున నన్నియుం జేసి

నాఁటి నిశాసమయంబునఁ దోరణస్తంభంబున కరుగునప్పు డంతకు మున్న యేనును నతిరయంబునం జని హరిమందిరం బెక్కి యేకాదశీవ్రతపరాయణులై యున్న విప్రులు విన నేఁడు మహామారీపతనం బగు నేమఱకుండుం డని పలికి వారు గానకుండ నేను సురిఁగి యరిగితి వారు వెడలి వచ్చి చూచి యరసి యెవ్వరిం గానక యది యాకాశవాణిపలు కుగా నిశ్చయించి. ౧౬౮

క. హస్తములు మోడ్చి శాంతి
స్వస్తికమంత్రములు నెరయ వారందఱు లో
కస్తవ్యోత్కుల దుర్గం
బ్రస్తుతి సేయంగ నర్ధరాత్ర మగుటయున్. ౧౬౯

వ. అంతకమున్న యెవ్వరు నెఱుంగకుండఁ దోరణస్తంభం బెక్కి యున్న మకరదంష్ట్రి యయ్యవసరంబున. ౧౭౦

క. స్తంభాగ్రతలమునను సం
స్తంభమ్మునఁ బవనుచేతఁ దల్లడపడుచుం
గుంభినిపైఁ నఁఱుకుదునా
యంభోరుహనయన యనుచు నతిరావమునన్. ౧౭౧

వ. ఎలుఁగిడిన నయ్యెలుంగు విని యిదియ మహామారీభాషణం బనుచు నమ్మహీసురులు మస్తకన్యస్తహస్తులై ప్రస్తుతింపుచు నోదేవీ! మాకీర్తనంబు లుల్లంఘింపక మామీఁద లఘింపక మమ్ము మన్నింపు మనుచు నుండ సైరింపలేక మకరదంష్ట్రికంపంబు నొందుచు మఱియును. ౧౭౨

క. పడుదుం బడుదు ననంగాఁ
బడకు పడకు మనుచు వారు ప్రార్థింపంగా

నెడపని పలుకుల మ్రోతయు
గుడిఁ బ్రతిరావమును శ్రవణఘోరంబయ్యెన్. ౧౭౩

క. తెలతెలవాఱినఁ బౌరులుఁ
గలవారందఱును జూచి కలకల నగఁగా
బలునగుఁబాటుల కోర్వక
యిలపై నా జంత కూలి యీల్గె రయమునన్. ౧౭౪

వ. ఏని ట్లాగోరంపుజఱభి యభిమానంబును బ్రాణంబునుం
గొని సమాధానంబున రూపిణితో నభిమతసుఖంబు లను
భవించుచు నున్నంత. ౧౭౫

క. కమలాకరుఁ డనుపతి చి
త్రముగాఁ దనమంత్రివరుఁడు వ్రాసిన నిజమై
నమహోపురి నున్నాఁ డ
త్యమితోన్నతి ననుచు జగము లాడఁదొడఁగినన్. ౧౭౬

క. ఆవార్తలు విని తత్పతి
పీవని మది నిశ్చయించి యిచ్చయలరఁగా
నావని తారత్నమునకు
నావృత్తాంతంబు చెప్పినం బ్రియ మెసఁగన్. ౧౭౭

క. ఏనును నీవుఁ గదలి య
మ్మానవపతిపురికిఁ బోదమా యనవుడు న
మ్మానినివచనంబుల క
త్యానందముఁ బొంది సకలధనములుఁ గొనుచున్. ౧౭౮

ఉ. దేవరఁ గాన నర్థిఁ జనుదేరఁగ నొక్కవనంబులోఁ గిరా
తావలి నన్నుఁ దాఁకిన నుదగ్రత నందఱ కన్నిరూపులై

చేవ దలిర్ప ఖడ్గమునఁ జెండఁదొడంగిన బంధుల న్వైస
న్యవురఁ గూర్చి తెచ్చి కడు వీఁక దలిర్పఁగఁ జుట్టుముట్టినన్.

క. తెగి యేను దునుమఁ దొడఁగినఁ
బగగొని ఖడ్గహతి కోర్చి పైఁబడి కొందఱ్
దెగఁగాఁ గొందఱు గాల్సే
మొగయకయును మెలఁగ మిడుకనీక యదిమినన్. ౧౮౦

క. బెట్టు వడియుండ నొక్కటఁ
బట్టి నిగళబద్ధుఁ జేసి భామను సామ్ముల్
ముట్టడిగొని యిచ్చోటికిఁ
బట్టుకొనుచు వచ్చి రిపుడు బలి యిచ్చుటకున్. ౧౮౧

వ. అంత నాభాగ్యంబున నిచ్చటికి దేవర విచ్చేసితి రనిన నత్యం
తసంతుష్టాంతరంగుం డై భీమభటాదులవలనుం గనుంగొని
నేఁ డిట్టిపుణ్యదివసం బగునే యని పలికి వసంతకువలను గనుఁ
గొని వలయుభటవర్గంబుం గొని చని కిరాతపల్లి ముట్టఁ
గొని మనసామ్ములతోడ రూపిణిం గొనితెం డనిన నపరిమిత
పరివారుం డై చిత్రకరాదులతోడ దాడివెట్టి శబరాల
యంబు ముట్టికొని. ౧౮౨

చ. అమితకిరాతవీరులఁ గృతాంతునిపాలికిఁ బుచ్చి బోరునన్
రమణిని వర్ణనీయమృగరాజి ధనాదుల సంవినోదపా
త్రము లగుపక్షుల స్శబరరాజమనోహరకన్యకావలిం
బ్రమద మెలర్పఁ గైకొని ధరావరుపాలికి వచ్చి రంతటన్.

శా. తారానాయకబింబరత్నకలశీధారాళనిర్యత్సుధా
సారాభ్రంకషదుగ్ధవార్ధిలహరీసంతాననిత్యప్రభా

పారంపర్యపరాభవారభటికప్రాగల్భ్యభాస్వద్యశో
హారశ్రేణిపరిష్కృతాఖిలదిశాహస్తీంద్రకుంభస్థలా. ౧౮౪

క. శ్రీరామాయణభారత
పారాశరసూక్తికూర్మపద్మప్రముఖా
పారపురాణవిలోచన
గౌరవమతిధన్య మంత్రిగణమూర్ధన్యా. ౧౮౫

మాలిని. శరదమృతమయూఖశ్లాఘు తేజోమయూంగా
హరిహరపదపద్మధ్యానధన్యాంతరంగా
నరపతినయవిద్యానర్తకీనాట్యరంగా
పరబలతిమిరాళీభంజనోద్యత్పతంగా. ౧౮౬

గద్యము. ఇది శ్రీమద్వెన్నెలకంటి సూరనామాత్యపుత్ర హారితసగోత్ర పవిత్ర సుకవిజనమైత్రీ విధేయ అన్నయనామధేయప్రణీతం బైన షోడశకుమారచరిత్రంబు నందు ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము.

## పంచమాశ్వాసము.*

క. శ్రీచరణాంబుజసేవా
వైచిత్రీనిరత శిష్యవర్గమహాశ్రీ
ప్రాచుర్యమూలకరుణా
సూచితమాహాత్మ్య యన్నసూరామాత్యా. 1

వ. అమ్మహీపాలునితో బేతాళుం డొక్కకథ విను మని యిట్లనియె. 2

### —♦ (5) భోజనవనితాశయ్యాచంగులకథ ♦—

మ. నతిపాత్ర మ్మగునంగదేశమున విష్ణుస్వామి యన్భూవరుం
డతిధన్యుండు శ్రుతాన్వితుండు మఘదీక్షాయుక్తుఁ డై సౌ
ఖ్యవి,శ్రుతులౌ యౌవనరమ్యులం దనదుపుత్రు ల్మువ్వు
రం జూచి త,త్పైతృకృత్యంబున కొక్కకచ్ఛపము దేర
బంచె వారాశికిన్. 3

క. పనిచినఁ జని వార్ధితలం
బున నారసి యొక్కకూర్మముం గని పాలకం
పును బిచ్ఛిలంబు నగుత
త్తను వంటఁగ రోసి తరుణతాగర్వమునన్. 4

*తృతీయ చతుర్థాశ్వాసములు లభింపలేదు.

మ. వనితాచంద్రుఁడ దీనికంపునకు నోర్వంజాలఁ జేపట్ట నే
ననిథుం డొక్కఁడు వల్కె; నొక్కరుఁడు శయ్యాచంద్రుఁ
డ౯ దీనిపై, ఘనదుర్గంధము దుస్సహం బనుచు సోఁకం
బాసె; నొక్కండు భోజనచంద్రుం డను దీని ముట్ట నని
యిచ్చ౯ రోసె భూమీశ్వరా. ౫

మ. ఘనగర్వాంధమనస్కులై యిటులు దీక్షాభంగదోషంబుల
న్ననకుం డుందునధోగతిం దలఁప కాచారంబు ధర్మక్రమం
బును నూహింపక కచ్ఛపంబుఁ బొరిచూపుల్ సూచి వే
యంట కేఁచినగర్వంబున నేగి రుద్ధతులకు న్సిద్ధించునే ధ
ర్మముల్. ౬

చని యామువ్వురుం దమలోన వాదు మానక తమతారత
మ్యంబులం దగువారి నడిగి తెలిసికొంద మని కడంక విటం
కాధీశుం డైన సేనజిత్తుపాలికి నరిగి, ౭

క. సంగడిన నిలిచి భోజన
చంద్రుండను నేను యువతిచంద్రుఁడ శయ్యా
చంద్రుఁడ నే మువ్వురలో
నం గడుసుఖ యెవ్వఁ డనిన నవకుతూహలమునన్. ౮

ఈరే యిచ్చట నిలువుం
డారసెదఁ బ్రభాత మగు డనంతర మనుచు
న్వారల నెంతయు నాదర
మారంగా నిలిపి నృపతి యాదివసమునన్. ౯

క. రాజమృగనాభిపరిమళ
రాజితకలితోపదంశరసయుతగంధ

భ్రాజితశాల్యోదనమును
భోజనచంగునకు మోదమునఁ బెట్టుటయున్. ౧౦

క. అన్నంబు కమరువలచుచు
నున్నది భోజనము సేయ నొల్ల ననుచుఁ దా
నున్ననఁ దొలంగి వచ్చిన
నన్నరపతి కారణంబు నరయించుటయున్. ౧౧

వ. పితృవనక్షేత్రంబునం బండినధాన్యంబున నైనయన్నం బిది యన్నెలవు ప్రేతధూమావృతం బగుటచేతం గమరువలచెడి ని ట్లెఱుంగునే యని కొనియాడి వాని భోజనచంగుంగా శ్చయించి. ౧౨

గీ. ఒప్పు గలుగుదాసి నొక్కతెఁ జందన
మాల్యపట్టవస్త్రమండనములఁ
జెలువు మీఱునట్లు చేసి నారీచంగు
పాల నుండు మనుచుఁ బంచుటయును. ౧౩

వ. అది డగ్గఱిన నాసుభగుండు దానియొడలు మేఁకగదురు వలచుటయును నాఘ్రాణంబ. ౧౪

గీ. ముక్కు మూసికొనుచు మునుకొని రోయుచుఁ
జాల సేవ పడుచు శయ్య డిగ్గి
యిట్టికష్టకాంత నెందును గానము
వెదకి యనిన మనుజవిభుఁ డెఱింగి. ౧౫

వ. ఆదాసిం బిలిపించి యిట్టికంపు వచ్చుటకుం గారణం బేమి యని పరికించి. ౧౬

గీ. జనని కడచిన సత్యంతశైశవమునఁ
గోలె నది యొక్కమేఁకచ న్నుడిచి పెరుఁగు

ఱుఱీఁగి నాఁ (డది యెఱుఁ)గుట యిచ్చ మెచ్చి
యధిపుఁ డతని నారిచంగుఁ డని నుతించె. ౧౭

క. సంగతసప్తాస్వరణో
త్తుంగం బగుపాన్పు ప్రియములో నిడి శయ్యా
చంగు శయనింపఁ బనిచిన
నంగం బాశయ్యఁ జేర్చి యాక్షణమాత్రన్. ౧౮

క. ఒడ లొత్తె ననుచు వాఁ డెలుఁ
గడరఁగ వాపోవుచు ను రయంబున నాయి
ల్వెడలి చనుదేర భూపతి
యడుగుచు నాశ్చర్య మంది యంగ మరయఁగాన్. ౧౯

ఏడుపలుపులక్రింద నున్న వెంట్రుక యొత్తిన. ౨౦

ఒడల వలయంబులాంఛన
మడరఁగ నొకరోమ మొత్తి యరుణచ్ఛవి నే
ర్పడి యునికి సూప నచ్చెరు
వడి శయ్యాచంగుఁ డనుచుఁ బ్రస్తుతి చేసెన్. ౨౧

క. ఈవిధమున నవ్విభుఁ డా
మూవురయంతరము నరసి మోదంబున సం
భావించి యిష్టధనములు
భావ మలర నిచ్చుటయును బరమప్రీతిన్. ౨౨

వ. భోగపరాయణు లై యానగరంబున నుండి రంత నక్కడ.

క. తనయాగము మానినఁ ద
జ్జనకుఁడు భార్యయు ను దానుఁ జాల నియతిమై
ననశనదీక్షాపరతం
దనువు దొరఁగి సురనికేతనంబున కరిగెన్. ౨౩

వ. అని కథ చెప్పి యీమువురయందు జనకుమరణం బెవ్వరిం
జెందు నని యడిగిన. ౨౫

సీ. ప్రకటంబుగా నేడుపఱుపుల క్రిందట
నున్నట్టి వెండ్రుక యొత్తినట్టి
యత్యంతభోగి శయ్యాచయుఁ బొందదు
కమఠంబుఁ బట్టనికడిఁది యఘము
మేఁకుఁ గీడు నెఱుంగఁజాలెదునట్టి త
జ్ఞులుగాని యెంతయు సుఖులు గారు
గాన భోజనచంగకామినీచంగుల
యాగవిఘ్నంబున నైనయఘముఁ
దల్లిదండ్రులు గడచిన తద్దురితము
పొందు ననిన నదృశ్యుఁడై భూజమునకు
పేఁక వేతాళుఁడరిగిన వెంటనరిగి
బలముమీఱఁగఁబట్టి భూపాలసుతుఁడు. ౨౬

వ. మగిడి చనఁ దొడంగిన నింక నొక్కకథ విను మని వేతా
ళుం డి ట్లనియె. ౨౭

—♦ (౬) జ్ఞానవిజ్ఞానశూరుల కథ ♦—

సీ. సురపురిజయిని నాఁ బరఁగునుజ్జయిని ము
న్బుణ్యసేనుం డను భూవిభునకుఁ
జాల నిష్టుఁడు హరిస్వామి యన్విప్రుండు
వినుతచరిత్రుఁడై పెనుపునొందు
నతనికి వేదవేదాంగపారగుఁడు దే
వస్వామి యనియెడు వరసుతుండు

భువనసన్నుత యనఁబొల్చు సోమప్రభ
యనుకన్యయును గల్గె నమ్మృగాక్షి
జ్ఞాని కొండెను నన్ను విజ్ఞాని కొండె
నధికశూరున కొండె ని మ్మన్యనొల్ల
నిదియ నిశ్చయ మనుటయు నిచ్చయలర
నతఁడు నట్టులచేసెదననియె నంత. ౨౮

మ. ఇనవంశుం డగురాజు తత్పురముపై నేతెంచినం దాను మా
ర్కొనఁగా నోపక పుణ్యసేనమనుజేంద్రుం డాహరిస్వామి న
జ్జనవాథాగ్రణిపాలికిం బనుప నుత్సాహంబుతో నేగి పో
యినకార్యంబు ఘటింపఁ జేసి పురికై యేతేరఁగా నయ్యెడన్.

శ్రీనందనసమభావుఁడు
భూనందితుఁ డొక్కవిప్రపుత్త్రుఁడు నాకు
న్నీనందన నిమ్మని సుజ
నానందచరితుని నతని నర్థి నడిగినన్. ౩౦

క. జ్ఞానివొ శూరుండవొ వి
జ్ఞానివొ నాతనయ యిట్టిచందమువానిం
గాని వరియింప దన వి
జ్ఞాని నని పరీక్ష నేర్పెనఁగఁ జెప్పుటయున్. ౩౧

క. ప్రమదంబునొంది విప్రో
త్తమ నాసుత నీకు నిచ్చెద న్నేఁటికి స
ప్తమ మగుదివసమున వివా
హముచేసెద ననుచు నిశ్చయంబుగఁ బలికెన్. ౩౨

గీ. సదమలజ్ఞాని యొకరుండు సదనమునకు
వచ్చుటయుఁ గన్నతల్లి భావంబెలర్పఁ

దనయ నిచ్చితి నేఁడవదినమునందు
నీకుఁ బెండ్లిచేసెద నని నిశ్చయించె. ౩౩

క. అతసిసుతుఁ డొక్కయెడ కొక
క్రతువునకుం జనిన నతనిఁ గని రూపబలా
న్వితుఁ డొకవిప్రసుతుఁడు స
న్నుతచరితా నాకు నీయనుజ నిమ్మనినన్. ౩౪

క. జ్ఞానివొ శూరుండవొ వి
జ్ఞానివొ నాయనుజ యిట్టిచందము వానిం
గాని వరియింప దన్నను
నే నతిశూరుండ ననుచు నెంతయుఁ గడఁకన్. ౩౫

వ. ధనుర్విద్యాకౌశలంబును మల్లవిద్యపెంపునుం బ్రకటించిన. ౩౬

క. ప్రమదంబు నొంది విప్రో
త్తమ నాయనుజాత నిచ్చెద న్నేఁటికి స
ప్తమ మగుదివసమున వివా
హము చేసెద ననుచు నిశ్చయంబుగఁ బలికెన్. ౩౭

వ. ఇవ్విధంబునం బ్రత్యేకనిశ్చయంబులు చేసికొని హరిస్వామి
యు దేవస్వామియు సదనంబునకు వచ్చి యొండొరువు
తోడం దమతమ నిశ్చయంబులు చెప్పక కన్యతల్లి నొడివిస
దినంబునకు వలయుపదార్థంబు లలవరించి రంత. ౩౮

క. జ్ఞానియు శూరుండును వి
జ్ఞానియు నాలగ్నతిథికి సంభ్రమ మెసఁగం
గా నరుగుదెంచి రత్తఱిఁ
గానఁబడకపోయె విప్రకన్య యరుదుగన్. ౩౯

ఉ. దానికిఁ దల్లడిల్లి వసుధామరవర్యుఁడు జ్ఞానిఁ జూచి యే
మైనది నాతనూజ యని యడ్గిన నింతకము న్నదృశ్యుఁడై
దానవుఁ డొక్కఁ డింతిఁగొని తద్దయు వేఁకను వింధ్యభూమి
భృత్కాననభూమి సొచ్చె ననఁగా విని యెంతయు సంభ్ర
మంబునన్. ౮౦

మ. వెలివార న్వసనేగుతే రొకటి యావిజ్ఞాని గావింప సు
స్థిరశౌర్యం బెసఁగంగ శూరవరుఁ డాతేరెక్కి వింధ్యావనీ
ధరకాంతారము సొచ్చి యుగ్రగతి నాదైత్యేంద్రునిం దాఁకి
భీకరబాణంబుల వానిఁ ద్రుంచి వడి నాకన్యామణిం దె
చ్చినన్. ౮౧

గీ. కరము ముదమంది పుత్రికఁ గౌఁగిలించి
తగిన పెండిలికొడుకుల ముగురఁ గాంచి
మువ్వురును నుపకారు లీ ముగురయందు
దగినవరుఁ డెవ్వఁడని చింతఁ దగిలియుండె. ౮౨

క. అని కథచెప్పి నరేంద్రా
ఘనులాముగురందు విప్రకన్యావరణం
బున కెవ్వఁడర్హుఁ డనుటయు
జననాయకుఁ డిట్టు లనియె సరసత మెఱయన్. ౮౩

ఆరసి జ్ఞానదృష్టిఁ గమలానన యున్నెడఁ జెప్పినాతఁడుం
దేరుఘటించి నాతఁడు మదింబరికింపఁగఁ గన్యరాకకుం
గారణమాత్రముల్ దనుజఘస్మరుఁడై వరవర్ణిఁ దెచ్చె నే
పారఁగఁ గాన శూరుఁడ మహార్హుఁడు కన్యవరింప నావుఁడున్

క. ఘనరయమున వేతాళుఁడు
చని తరు వెక్కుటయు వెంటఁ జని పతి మగుడం

గాని తేరఁగ నింకొకకథ
విను మని యాతనికి వింతవేడుక దనరన్. ౪౫

—• (7) మదమంజరికథ •—

క. మనుజేశ్వర శుద్ధపటుం
డనురజకుం డొకఁడు మోహనాకార మహీ
జనవినుతను మదమంజరి
యనియెడివరపుత్త్రిఁ గనియె నంబవరమునన్. ౪౬

వ. అన్నారీమణిమోహనాకారంబు గనుంగొని ధవళుం డనుర
జకుండు మనోభవాధీనమానసుం డైన వానిజనకుం డెఱింగి
దానిజననీజనకుల నొడంబఱిచి యక్కన్యం దనతనూజునకు
వివాహంబు గావించుకొని పురంబునకుం దోకొని పోయిన. ౪౭

క. ధవళుండును వేడుక నా
ధవళాంశుముఖి న్వినూత్నధవళాంబుజచా
రువిలోచనఁ బొందె మనో
భవసౌఖ్యము నొందుచుండెఁ బాయనివేడ్కన్. ౪౮

ఉ. అంతట నొక్కనాఁడు దనయల్లుని గూఁతును దోడితేర న
త్యంతముదం బెలర్పఁగ నిజాత్మజు శుద్ధపటుండు పంపఁగా
నెంతయుఁ బ్రీతి వాఁ డరిగి యిద్దఱుఁ దోడ్కొని యేగుదెం
చుచో, సంతతశోభితం బయిన చండికగేహముపొంత న
క్కడన్. ౪౯

క. ధవళుండు దనమఱంది ని
ధవళేక్షణ నచట డించి తానొకఁడుఁ బ్రభా
ధవళ మగు భద్రకాళీ
భవనంబున కేఁగి యధికభక్తియుతుం డై. ౫౦

క. తను విధి కడుఁ గ్రేరేఁపఁగ
మును ప్రొక్కితి నని కఠారమునఁ దనగళముం
దునుముకొని తల యుమాపద
వనజంబులమీఁద నిలిపి వ్రాలె ధరిత్రిన్. ౫౧

వ. అత్తెఱం గెఱుంగక యెంతయుం దడ వెదురుచూచి వాని
మఱంది దేవిమందిరంబున కరిగి యాచందం బెనయతనిం గ
నుంగొని డెందంబునం దల్లడిల్లి నాకు వీనితోడిద లోకంబు
గాక యని శిరంబు ద్రెంచుకొని తానునుం గూలిన. ౫౨

క. పడఁతుక యయ్యిద్దఱు నటఁ
దడయుటకును మది భయంబు దనుకఁగ వెస న
గ్గుడిలోని కరిగి యిరువురుఁ
బడినవిధముఁ జూచి శోకభయవిహ్వల యై. ౫౩

క. ఆవరుఁడు సహోదరుఁడును
జీవంబులఁ బాసి యుండ జీవముతో నే
నీవార్త తల్లిదండ్రుల
కేవిధమునఁ జెప్పఁ బోదు నిం కిట ననుచున్. ౫౪

క. జీవంబు విడుచుతలఁపున
దేవీభవనంబుపొంత దీర్ఘతరువునం
దీవ యురి వెట్టి తత్సతి
యావిశ్వపవిత్రి నిట్టు లని నుతియించెన్. ౫౫

శా. శ్రీరామాధిపవాగ్వధూవరులు నీశ్రీపాదసేవారతుల్
శ్రీరమ్యంబులు నీమహత్త్వములు నీశృంగారసాహిత్యలే
ఖారూపంబు మహేశుదేహము జగత్కళ్యాణి నీసత్త్వ మెం
వ్వారుం బ్రస్తుతి సేయనేర్తు రె కృపావారాశి కాత్యాయనీ.

వ. అని విన్నవించిన నం బ్రసన్న యై యాజగన్మాత సోదరుని౦ బ
తిని బ్రతికించెద నయ్యిరువురశిరంబులు దేహంబులఁ గది
యింపు మనిన సంతసిల్లి యంధకారంబున నెఱుంగక. ౫౮

గీ. మగనిబొందిని నన్నమ స్తకంబొనఁగూర్చి
యన్నశిరము మగని నంటఁగూర్పఁ
దలలు వీడువడినతనువులతో వారు
జీవకలితు లైరి దేవికరుణ. ౫౯

వ. అని కథఁ జెప్పి వేతాళుండు నరేంద్రా వీరిలోన నింతికిం బ
తి యెవ్వఁ డగు నని యడిగిన నవ్వుచు సకలేంద్రియంబులం
దును శిరంబు ప్రధానం బగుటఁ బతిశిరంబువాఁడు పతి యా
గు ననిన వేతాళుం డప్పటియట్ల తరువున కరిగిన మగుడనం
బట్టి తెచ్చునప్పుడు వేతాళుం డతని యాతాయాతంబుల
డస్సితివి యే నడుగుప్రశ్నంబుల కుత్తరంబులు సెప్ప నీవ
కాని యెవ్వరు నేర రింక నొక్కకథ విను మని యి ట్లనియె

## —♦ (8) దేవసేనచరిత్రము ♦—

క. మును వీరబాహుఁ డనియెడు
మనుజేశ్వరుపీట రూపమహిమోన్నతుఁ డై
పెనుపొందెను ధనవంతుం*
డనువై శ్యకుమారుఁ డుజ్జ్వలాకారమునన్. ౬౦

గీ. అతఁడు దేవసేన యనియెడుకన్యక
యౌవనాభిరామ ననమధామఁ
జూచి మన్మథాస్త్రశోషితహృదయుఁ డై
యాత్మలోనఁ దాప మగ్గలింప. ౬౧

* ధనదత్తుఁడు, ధర్మదత్తుఁడు - అని యీకథలో నేకలదు

క. పరమేశుఫాలశిఖి యు
ద్ధురతం దనుఁ గాల్ప మంటతోడను మదనుం
డురవడి డెందము సొచ్చిన
కరణిం గామాగ్ని లోనఁ గాల్పఁదొడఁగినన్. ౬౨

వ. ఆవాలుఁగంటి యొంటి విహరించునెడకుం జని తలం పెఱిం
గించిన నది లజ్జావనతవదన యగుచు ని ట్లనియె. ౬౩

గీ. నను సముద్రదత్తుఁ డనుగుణాధికునకు
నిచ్చినాఁడు తండ్రి యెల్లి పెండ్లి
యనఘ నేను బరునియంగన నై యుండఁ
దగునె యిట్టితలఁపుఁ దలఁప నీకు. ౬౪

క. అనుటయు నాధనదత్తుఁడు
మనసిజదందహ్యమానమానసుఁ డై ప్రా
ర్థన మొనరింపంగా ని
ట్లనియెం గమలాయతాక్షి యతిమధురముగన్. ౬౫

గీ. పెండ్లి యాడి యేను బ్రియుని బొందకమున్న
నిన్నుఁ జెందుదాన నిక్కువంబు
నమ్ము రాకయున్న నాసుకృతము నీద
యనినఁ బ్రియముతోడ నరిగె నతఁడు. ౬౬

సీ. అపరదినంబునయందు శోభనలగ్న
మాసన్న మగుటయు నసమమహిమఁ
దల్లియుఁ దండ్రియుఁ దగుకులోచితమంగ
ళోపచారములు పెంపొందఁ జేసి
చెలువారఁ గన్యకు శృంగార మొనరించి
భద్రంబు మీఱ సముద్రదత్తు

నకుఁ బెండ్లి యొనరించి నాఁటి నిశావేళ
నాతనిశయ్యకు ననుచుటయును
దనమనంబున నెంతయుఁ దమక మడరఁ
గవియ వేఁడుకపడిన నాకాంతుతోడ
భయము లజ్జయు మదిలోనఁ బాయఁబెట్టి
యెంతయును ధైర్యమున నింతి యిట్టు లనియె. ౬౭

గీ. అధిప యేను సత్యహానికి నోర్వక
యొకటి నీకుఁ జెప్ప నుత్సహించి
వెఱచి యున్నదాన విపులధైర్యముతోడ
నవధరింపవలయు నత్తెఱంగు. ౬౮

వ. నిన్న ధనదత్తుఁ డనువాఁడు నన్నుఁ గామించి యేకతంబునం బట్టి నమకట్టిన వాని శాంతించుటకు నోర్వక యేను వివాహానంతరంబున వచ్చెద నని వానికి సత్యంబు చేసితి నాస త్యంబుఁ బాలింపు మనిన నొడంబడి సముద్రదత్తుండు త న్నుం బంచిన. ౬౯

క. అరమణి రత్నభూషణ
హారావళి వెలుఁగ నొంటి నరుగఁ దొడంగెం
దారావళివృతమూర్తి
స్ఫారాకృతి యొప్పు రాత్రిసతియుం బోలెన్. ౭౦

వ. ఇట్లు విజనం బగు పౌరమార్గంబున నిరర్గళగతి నరుగు సమ యంబున. ౭౧

సీ. మిడిగ్రుడ్డులును గోరమీసంబులు మహాభు
జములు వి స్తీర్ణవక్షఃస్థలంబు

నతికఠినంబుఁ గాలాంజనాభము నైన
విగ్రహంబును గుర్కుఁ వెంద్రుకలును
నీలాంబరంబును నిర్దయభావంబు
నత్యంతభయదంబు నగుచుఁ దనరు
ఘనతరనిబిడాంధకారభయంకర
శబరసేనాపుదస్సురుఁడు వోలె
నసమనక్షత్రరత్నచౌర్యమున కంబ
రంబుఁ బ్రాఁకి నమర్చిన రజ్జు వనఁగ
మెఱసి యసిదీప్తిపుంజంబు మిన్నుముట్టఁ
జోరుఁడొక్కండు వచ్చి యాసుదతిఁ జేరి. 22

క. ఎక్కడిదానవు నడురే
యొక్కతెకిం బోయె దొంటి నిప్పుడు నాచేఁ
జిక్కితి రమ్మని యక్కటి
యక్కటికము దొలఁగి తమక మడరెమదిలోన్. 23

గీ. రాజవదన యేఁ జోరులరాజ నాకు
నీవుఁ దొడవులుఁ జిక్కితి నిలువుమనుచు
మగువ కరపంకజమువట్టి తిగిచె రాజ
కదళిఁ గబళించు నున్మదగజ మనంగ. 24

వ. ఇట్లు కరంబు పట్టి తిగిచినం గరంబు భయంబునొంది య
ల్లన నీతొడవులు గైకొని నన్నరుగంగనిమ్ము క్రమ్మఱ
మగిడి వచ్చెద ననిన నవ్వుచు నవ్వనితం గనుంగొని. 25

చ. మనసిజరాజ్యలక్ష్మి యగుమానవతీమణి నేకతంబునం
గనుఁగొని యిచ్చ నిచ్చలసుఖంబులఁ బొందక నీవు వోయిర
మ్మనినెడు కొఱ్ఱంకుం గలఁడె యంగన యిట్టులు పల్కె

దేటికి, న్వనితలు నేఱులు న్మగిడి వచ్చుట గల్గునె పాసిపో
యినన్. ౭౬

క. అనవుడు నావనజానన
తనవృత్తాంతంబుఁ జెప్పి తడయక వత్తుం
జననిమ్ము బొంక నావుడు
విని చోరుం డాత్మలోన విస్మితుఁడగుచున్. ౭౭

సీ. వామాక్షి క్రమ్మఱ వచ్చుట నిజమేని
మును నీవు ధర్మదత్తునకుఁ జేసి
నట్టి సత్యమునీయు మనుటయుఁ బ్రియమంది
యాపద్మలోచన యట్ల చేసెఁ
దన్కరుకడఁ బాసి ధర్మదత్తునిపాలి
కరుగుటయు ను జోద్యమంది యుతఁడు
సత్యంబు దప్పక చనుదెంచినప్పుడ
వరదేవతవు నీవు పద్మగంధి
కన్య వైననాఁడు కడువేడ్కఁ గోరితి
గాని యిప్పు డన్యకాంత వైతి
కాన నిన్నుఁ జేరఁ గాంతునిపాలికిఁ
జనుము నెమ్మి ననుచుఁ బనుచుటయును. ౭౮

క. ఇంతి యుసత్యభయంబున
నెంతయు వెసఁ జోరుకడకు నేగి తనవృ
త్తాంతముఁ జెప్పిన మది న
త్యంతాశ్చర్యంబు నొంది యాతఁడు కరుణన్. ౭౯

క. నీసత్యమునకు మెచ్చితి
నీసత్యముఁ దగవుఁగలదె యింతులకెందున్

నీసొమ్ము నిన్నుఁ గైకొను
నాస యుడిగి నాథుకడకు నరుగు మనుటయున్. ౧౧

క. తన పతికడకుం దాఁ జని
వనితామణి తాను బోయి వచ్చిన విధ మె
ల్లను జెప్పిన విని పతి మె
చ్చొనరఁగఁ గైకొని సుఖాబ్ధి నోలలనార్చెన్. ౧౧

వ. అని కథచెప్పి వేతాళుండు. ౧౨

క. ఆమువ్వురలో సాత్త్విక
తామహితుం డారయ ధనదత్తుఁడొ చోరుం
డో మగువమగఁడొ యనుటయు
నామనుజాధిశుఁ డిట్టులను నాతనితోన్. ౧౩

సీ. పరపురుషునికడ కరిగెద నన్నప్డ
విడువంగఁదగు నింతి విడువఁడయ్యెఁ
దలపోయఁగ సముద్రదత్తు చిత్తంబున
సత్త్వగుణంబు లేశంబు లేదు
పరకాంత నృపదండభయమునఁ గవియని
ధనదత్తువందు సత్త్వంబు లేదు
ముచ్చు ప్రాణములపై వచ్చినం జేరిన
యర్థంబు విడువని యట్టివాఁడుఁ
దలఁప నిట్లయ్యె లోభ మింతయును లేక
మణివిభూషలు మానినీమణియుఁ దనకు
నబ్బి యుండఁగఁ బొమ్మని యట్లు పనిచె
జగములోపలఁ జోరుండె సాత్త్వికుండు. ౧౪

వ. అనిన వేతాళుండు జనపతికి నద్భుతస్వాంతం బగుచు వృత్తాంతంబున

కఱిగిన వెనువెంటం జని తన్ను మనుజవిభుండు పట్టి తెచ్చి
నప్పుడు మఱియు ని ట్లనియె. ౬౫

క. అడిగిన నెవ్వారికి నే
ర్పడఁ జెప్పఁగరానియట్టిప్రశ్నంబులు చొ
ప్పడఁ జెప్పితి నీమదికిం
గడ గలదే యింక నొక్కకథ విను మనియెన్. ౬౬

—• (౫) వైశ్యకన్యకథ •—

గీ. (పూర్వకాలంబునను) భానుపురమునందు
ఘనుఁడు సూర్యప్రభుం డను మనుజనాథుఁ
డలఘుకీర్తి చందనమలయాద్రి యనఁగ
నెమ్మి రాజ్యంబు సేయుకాలమ్మునందు. ౬౭

క. ధరలోనఁ దామ్రలిప్తా
పురి ధనదత్తుఁ డను వైశ్యపుంగవుఁడు మనో
హరకాంతిరూపగుణములఁ
గర మరుదుగఁ దనరునట్టి కన్నియఁ గనియెన్. ౬౮

క. కప్పారు తుఱుమునన్నతి
యొప్పారెడు చన్నుఁగవయు నురుతరగరిమ
న్నొప్పారు నితంబంబును
నప్పొలఁతికి జవ్వనమున నందము చేసెన్. ౬౯

క. అంతట విధికృతి జనకుం
డంతము నొందుటయుఁ దాను నమ్మయు దుఃఖా
క్రాంతయయి రాజవరులకు
నెంతయు భయమంది యర్థమెలను గొనుచున్. ౭౦

వ. పుత్త్రియుం దానును నర్ధరాత్ర సమయంబునఁ బురంబు నిర్గ
మించి. ౬౧

క. తమభీతిశోకతమములఁ
దమమధికంబైనఁ దెరువుదప్పి యరిగి శూ
లమున నిడినచోరుని న
గ్రమునం గని యులికిపడుచుఁ గంపించుతఱిన్. ౬౨

క. వడిఁ గొఱ్ఱు కంఠమున వెలు
వడి యునికిం జేసి నొప్పివఱవఁగ వాఁడుం
గడుపుబ్బ ములుగఁ దొడఁగిన*
నెడగలుగుచు వైశ్యకాంత యెవ్వఁడవనినన్. ౬౩

మ. తెలివా చోరుఁడ శూలసంగతుఁడ నై తీం గ్రూరకర్మంబుచేఁ
గొఱఁతం బొందితిఁ జావురా దకట వాకుం ద్రొల్లి పాపంబులే
గుఱి లేకుండఁగఁ జేయఁబోలుదుఁ గదుగా గుప్పించి యిల్వే
దన, ల్దఱి చై యొందును బాపకర్ములకు నేలా మంచిచా
వచ్చెడున్. ౬౪

వ. అని పలికిన విని రవ్వ రెవ్వలనికిం జోయెద రనిన నవ్వనిత
నియె. ౬౫

క. పతిచచ్చినఁ దల్లడిలుచు,
సుతఁ దోకొని దిక్కుమాలి చుట్టలకడకుఁగా
గతి చెడి పోయెద నని తా
నతిదుఃఖిత యగుచునుండె నాసమయమునఁగా. ౬౬

క. రేరాజు వొడిచి యెక్కనఁ
జోరుం డావైశ్యకాంతసుత నతిసుభగా

* కడుపుబ్బ ములుగంగం దొడంగిన- నెడగలుగుచు.

కారం గనుఁగొని కడుఁ బ్రియ
మారఁగ నిట్లనియె దానియంబికతోడన్. ౯౭

సీ. అమితధనంబు శుల్కముగ నిచ్చెద నీకుఁ
దనయ నాకొసఁగి చేదారవోయఁ
బుత్రార్థముగ నన్యపురుషుని బొందంగ
ననుమతి యిచ్చెద నవ్విధమునఁ
బుత్రునిఁ గనిన నాపుత్రుఁడై వాఁడు దు
ష్కర్మ్ముని ననుఁ బూర్వగతికిఁ బుచ్చు
నాత్మసంభోగసౌఖ్యానందకందళి
తాభిలాషుండనై యుడుగ నిపుడు
వీఁడు గాఱు లాడెడు నని విడిచిపోక
యింతినిచ్చెద ననుమన్న నియ్యకొనుఁడుఁ
దన సమీపంబునందున్న ధనము సూపఁ
బుచ్చుకొని తనసుత దారవోసె నతఁడు. ౯౮

వ. ఇట్లు ధారవోయించుకొని ప్రముదితాంతరంగుండై సంతా
నార్థంబుగా నక్కన్య యన్యపురుషుం బొంద ననుమతి యి
చ్చి యాక్షణంబ ప్రాణంబులం బాసిన నచ్చోటు వాసి
ఘనం బగుధనం బొంబరించుకొని పుత్రికాసమన్విత యై
సూర్యప్రభుని పురంబునకుం జని ధనంబిచ్చి తగువారిచేత
నచ్చోరునికి నగ్నిసంస్కారములు చేయించి తన పినతండ్రి
యగు ధనపాలుని మందిరంబునకుం జని సుస్థితినుండె నొక
నాఁడు. ౯౯

క. సౌధమున నుండి వేడుక
నాధనవతి యొకమహీసురాత్మజు రూప

శ్రీధాముని వరకాంతిసు
ధాధామునిఁ జూచి రాగతరళిత యగుచున్. ౧౦౦

క. మానసభవబాణాహతి
మానము గోల్పోయి తనదుమాతకు మదిలో
నూనినవిప్రకుమారుని
పై నెయ్యముఁ దనదుతాపభరముం దెలిపెన్. ౧౦౧

వ. ఇట్లు దెలిపినం జోరవాక్యంబు మనంబునం దలంచి యఘం
బు లేమికి నిశ్చయించి యెవ్వరు నెఱుంగకుండ వానిం దో
తేర నొక్కదూతికం బుచ్చిన నాసాబగుం డిట్లనియె.

గీ. పంచశతరూప్యకంబులు వాయ కేను
నిచ్చలు వ్యయంబు సేయుదు నేఁడుమాత్ర
మిప్పు డేనూఱురూకల నిచ్చితేని
వరుగుదెంతు లేకున్న రా ననుచుఁ బలికె. ౧౦౩

ఉ. అప్పుడ యేగి దూతి యతఁ డాడినమాటలు వైశ్యకాంత
కుం, జెప్పిన దానిచేతికిని శీఘ్రము యర్థము నిచ్చి యేరికిం
జెప్పక రాత్రి రమ్మనినఁ జేకొని తా నమరేయి వచ్చి య
య్యొప్పులకన్య నింపుమెయి నోలల నార్చె సుఖాంబురాశి
లోన్. ౧౦౪

వ. ఇత్తెఱంగున నత్తెఱవతోడి యభీష్టలీలలం దగిలి యారాత్రి
గడపి ప్రభాతంబున నిజనివాసంబున కరిగి హారలతానామ
వారవనితాలోలుం డై యుండెఁ, దత్సమాగమంబున వై
శ్యపుత్రి దౌహృదలక్షణంబున నుల్లసిల్లి. ౧౦౫

క. గొంతివిధంబున గర్భం
బెంతయు గూఢముగఁ దాల్చి యనుపమతేజం

గాంతినిధి రాజలక్షణ
వంతు శుభాకారు నొక్కవరసుతుఁ గాంచెన్. ౧౦౬

వ. ఆపుత్త్రుఁ గాంచిననాఁటిరాత్రి శౌరీరమణుండు రమణికిఁ గల
సన్నిధినేసి యి ట్లని యానతిచ్చె. ౧౦౭

మ. తరుణీ నీసుతుఁ బెట్టిలోనిడి నృపద్వారంబునం బెట్టు మె
వ్వరునుం గానకయుండ నిప్డు చని లేవం గాంచి సూర్యప్ర
భుం, డురుతేజంబున వానిఁ జూచి మదిలో నుప్పొంగుచుం
బుత్త్రుఁగా, నిరవద్యోత్సవలీలమైఁ బెనుచు వీని న్నాదు ది
వ్యాజ్ఞ మై. ౧౦౮

వ. అనుటయు. ౧౦౯

క. పతిలేనిసుతుఁడు గలుగుట
యతినింద్యం బగుట మున్న యాత్మ వగచున
య్యతివ పరమేశునానతి
నతిసంతోషంబు నొందె నాక్షణమాత్రన్. ౧౧౦

చ. తనకపు డీశ్వరుండు విదితంబుగ నత్తెఱఁ గెల్లఁ జెప్పిన
న్వని ప్రియు మంది సజ్జ నిడి నిర్మలచేలము గప్పి తత్సుతుం
బెనుచు ఋణంబులేమికయి పెంపున మాడలు వేయి కొం
గునం, దొనరఁగఁగట్టి కొంచుఁ జని యుంచెను రాజగృహం
బు వాకిటన్. ౧౧౧

వ. అ ట్లెవ్వరు నెఱుంగకుండ నప్పట్టిం బెట్టి వచ్చి యక్కోమటి
లేమ తనతల్లి గృహంబున నిశ్చింతంబున నుండె నంతకము
న్న మేదినీకాంతుండు సంతానార్థి యై పరమేశ్వరప్రార్థనం
బు చేయుట నద్దేవుండు కరుణించి నాఁటిరాత్రి కలలోనం
బొడసూపి యఖిలసార్వభౌమపాత్రం బగు పుత్త్రుండు ప్ర

భాతంబున నగరివాకిట నుండెడుఁ గైకొని పెనుపు మని
యానతిచ్చిన నానతుఁడై యానందంబునుం బొంది వేకువ
నగరిమొగసాలకుం జని యబ్బాలునిం గాంచి మహోత్సవం
బు లొనరించి చంద్రప్రభుం డను పేరిడి పెనుప నక్కుమా
రుండు క్రమవర్ధితుండును, సకలవిద్యావిశారదుండు నై
సంపూర్ణయౌవనంబు నొందినసమయంబున. ౧౧౨

క. ప్రభువరుఁ డంద్రప్రభు నిల
కభిషిక్తుం జేసి (యడవి) కరిగి నగసుతా
విభుఁ గొలుచుచు సూర్యప్రభుఁ
డభినతయోగాభినిష్ఠ నసువులు దొఱఁగెన్. ౧౧౩

క. జనకుండు మేను దొఱఁగుట
విని చంద్రప్రభుఁడు నాత్మ వివశుండై యో .
లిన పారలౌకికక్రియ
లనూనముగఁ జేసి తా గయకుఁ జని యచటన్. ౧౧౪

వ. వేదచోది తానుష్ఠానంబు నొనరించి పిండప్రదానంబు సేయం
గరం బెత్తుటయు నక్కజంబుగా నాసమయంబున. ౧౧౫

గీ. అంచిత పవిత్రభూషణం బైనకరము
కంకణసముజ్జ్వలం బైనకరము గాఁగ
నలఘుశంఖశస్త్రాంకిత మైనకరము
మూఁడుకరము లాభూపాలుఁ డాల నిలిచె. ౧౧౬

క. ఆకరములఁ గని (ఘన)చిం
తాకులమతి యగుచుఁ బిండ మాకరములలో
నేకరమున నిడనేరక
వే కరముం దిగిదిగొనుచు విన్నఁదనముతోన్. ౧౧౭

వ. వేదశాస్త్రపారగు లగు నచ్చటిపెద్దలకు నాహస్తములు సూపి యి ట్లగుటకుం గారణం బేమి యన వారు విచారించి యి ట్లనిరి. ౧౧౫

చ. పరమపవిత్రహస్త మిది బ్రాహ్మణహస్తము శంఖశస్త్రభాసుర మయియున్నహస్త మిది చోరునిహస్తము రత్నకంకణస్ఫురణ దలిర్పు హస్త మిది భూపతిహస్తము వీనిలోన నే కరమును బాత్రమో నిజముగాఁ గన రా దని పల్కి రం దఱున్. ౧౧౯

వ. అని కథ చెప్పి వేతాళుండు భూపాలా యాకరంబులలోనం బట్టియందు నేకరంబు పిండప్రదానంబున కర్హం బని యడిగిన నం బుడమిఱేఁ డి ట్లనియె. ౧౨౦

ఉ. కొంగున మాడ లూడ్చికొని కొడ్కని పెంచినరాజు తండ్రి గాఁ, డంగజకేళికార్థము తదంబిక వేఁడిన విప్రుఁడుం దలం పంగ గురుండు గాఁడు కులభామిని గాఁగ వరించె వాని మాఁతం గమియంగ నర్థ మిడి తండ్రగుఁ జోరుఁడు వాని కారయన్. ౧౨౧

వ. పిండప్రదానంబునకుం జోరుకరం బరయ నర్హం బనుటయు నదృశ్యుం డై యెప్పటిభూజాతంబున కరుగ వెనుకన చని తన్నుం బట్టి తెచ్చునెడ వేతాళుండు నమ్మహీపాలున కి ట్లనియె. ౧౨౨

క. ఎన్నేనియుఁ బ్రశ్నములకు
నన్నఁగఁ దగునుత్తరంబు లిచ్చితి నాకుఁ
దన్ని ట్లలజడి వెట్టుచు
నున్నాఁ డని తలఁప కింక నొకకథ వినుమా. ౧౨౩

—• (10) ధర్మరాజుకథ •—

క. మనుజేశ ధర్ముఁ డనియెడు
మనుజాధీశ్వరుఁడు, తొల్లి మాత్తుర చేతన్
ధనమును రాజ్యముఁ గోల్పడి
తననగరము విడిచి తరళితస్వాంతుండై. ౧౨౪

క. ఆవిభుఁడు ఖడ్గదీప్త
వ్యావృతహస్తుఁ డయి చంద్రవతి యనుదేవిన్
లావణ్యవతి యనెడుసుత
నావనమునఁ గొనుచు నొకఁడు నరిగెడువేళన్. ౧౨౫

చ. అలఘుమణిద్యుతిం బొలుచు నావిభు భూషణరాజిఁ జూ
చి బోయలు గడువీఁకఁ దాఁకుటయు నందఱ మున్మిడి
శాతహేతి ని,ర్దళితులఁగా నొనర్చి భుజదర్పము మానక ని
ల్చి వారిచే, నలుగుల వేదన న్వివశుఁడై హరిపీటికిఁ దాను
నేగినన్. ౧౨౬

ఉ. అన్నరనాథుఁ డీల్గుటయు నాతనికామిని దానుఁ బుత్రియు
న్విన్నఁదనంబు దోఁప నటవీస్థలి నేగెడుచోటఁ జన్నులుం
బెన్నెఱివేణులున్ జఘనబింబములుం గడు వీఁగఁ జేయఁగా
సన్నపుఁగౌను లెంతయును సంచల మందఁగ నార్తిఁ గూరు
చున్. ౧౨౭

క. ఉలుకుచు నేగిరి వెన బె
బ్బులిరాకకుఁ దొలఁగులేళ్ల పోలికి భయసం
చలితవిలోచననీలో
త్పలరోచులు గప్పి విపినభాగము లొప్పన్. ౧౨౮

వ. ఆ ట్లరిగి యరిగి యత్యంతపథిశ్రాంతి నొంది. ౧౨౯

క. *లుంగలవంగ
నగ గిరిసరసీ
తుంగతలవనముఁ దూఱి ల
తాంగులు వెన నడఁగి యుండి రచ్చట నంతన్. ౧౩౦

వ. చండవిక్రముం డనుమండలనాథుండు సింహవిక్రముం డనుత
నయుండునుం దాను నక్కాననంబునకు వేఁట వచ్చి య
ప్పొలంతులు చనినచొప్పు గాంచి పుత్రు నవలోకించి.

క. అడుగులు నిడు పగుకాంతయు
నడుగులు కుఱుచ లగునంబుజాక్షియు ను భయం
బడరఁ జనినారు వీరలఁ
బొడగని (మన)పురికిఁ గొంచుఁ బోయెదమనిన్. ౧౩౨

క. చరణములు నిడుపు లగునా
సరసీరుహనేత్ర నాకు సన్నపుఁ బాదాం
బురుహములయింతి నీకును
†గరనీత లటంచు నూత్నకౌతుక మొసఁగన్. ౧౩౩

క. చరణంబులచొప్పునఁ జని
సరసీతటికాననమున శ్రమపడిన మనో
హరవనదేవతలో యనఁ
గర మొప్పెడుసతులఁ గాంచి కడుముద మొదవన్. ౧౩౪

ఉ. వాడియు నొప్పు సేసె ముఖవారిరుహంబులు ఘంటికావళి
స్వేడియు వేడ్కఁ బెంచె నెఱివేణులు గ్రమ్మెడుఘర్మవారి

---

* లుంగలవంగచూతముల గంధములం బెనంగిన __ మూ.

† కరణీతలటంచు__మూ.

లోఁ, గూడియు సమ్మోదంబు నొందఁగూర్చిన మేనులు చూ
డ్కి భీతి న, ల్లాడియుఁ బొల్చె నీసతులయందము సుస్థితి నె
ట్టు లుండునో. ౧౩౫

వ. అని యి ట్లభినందించి సమయంబు చేసికొనినవిధంబునం బె
ద్దయడుగులముద్దియుం దండ్రియుం గుఱుచయడుగులతెఱవఁ
బుత్రుండును నత్యనురాగంబునం గై కొని పురంబునకుం గొ
ని చని యల్లన నయ్యిరుతులవిధం బంతయు నెఱింగి. ౧౩౬

క. కుఱుచడుగులయది తల్లియుఁ
గుఱుచలు గానడుగులయది కూఁతురు నయినన్
వెఱఁ గంది వారినియతిం
దొలఁగక వరియించి రరయ దుర్నయ మైనన్. ౧౩౭

వ. అని కథ చెప్పి వేతాళుండు నరేంద్రా వారిరువురకును న
వ్వారిజనేత్రలవలన ననేకపుత్రు లుదయించిరి తత్తనయులు
దమలోన నేమి యగుదు రని యడిగిన. ౧౩౮

క. ఎప్పగిది విచారించినఁ
జెప్పంగానేర రాక చింతాకులుఁ డై
చెప్పఁగరా దీప్రశ్నముఁ
జెప్పు మనుచు నడిగె నేమి సేయుదు ననుచున్. ౧౩౯

వ. నిర్విణ్ణుం డై మౌనంబునం జనుచున్న యమ్మానవేంద్రువ
లన సంతుష్టుం డై వేతాళుం డి ట్లనియె. ౧౪౦

మ. ధరణీనాయక నీదుశౌర్యమును సత్యంబుం బ్రతాపంబు ని
ద్ధర నెవ్వారికి లేదు నీ దగుచరిత్రం బెప్డు విన్వారలం
గర మర్థిం బులకింపఁ జేయుచు శిరఃకంపంబు చేయించు నీ
సరిగా నెన్నఁగఁ బోలు రాజు గలఁడే సర్వజ్ఞచూడామణీ.

చ. నరవర బ్రాహ్మణుండు నిను నా కుపహారము చేయఁ బూ
ని న,స్థిరుఁ డతిపాపచారి ననుఁ దె మ్మని పంచుట నిట్లు నీ
వు న, న్వరమతిఁ గొంచుఁబోవుటయు నాకుఁ బ్రణామము
సేయఁ బంచి నీ,శిరము హరించుఁ దోన యిటు చెప్పితి నీ
కు హితోపదేశమున్. ౧౪౨

క. నిను నాకు మ్రొక్కు మనఁగా
మును మ్రొక్కి యెఱుఁగ నేను మ్రొక్కెడువిధ మి
ట్లని చూపు మనుచు మ్రొక్కఁగ
దునుము వెస న్వానిశిరము దొరసిచేతన్. ౧౪౩

వ. ఇవ్విధంబు నాచేత వినక మోసపోయితేని నీశిరంబు ను హృ
దయపద్మంబు ను నాకు నివేదించి వాఁడు విద్యాధరచక్రవ
ర్తిపదంబు నొందు నీవు పరమపుణ్యుఁడవు గావున నీ కట్టి
యుపాయంబు పుట్టదు నీవు వానిశిరంబు ద్రుంచి తదనంత
రంబ తద్వక్షోదళనం బాచరించి హృదయపద్మంబు పుచ్చి
నన్నుం బూజింపుము నీకు మనోరథసిద్ధి యయ్యెడు నని దీ
వించి యే నీశవంబురూపంబునం బాసి యవ్వటపి కరిగి భి
క్షుం డాకర్షింప వచ్చి యుందుఁ బ్రవేశించి నీకు వరదుండ
నయ్యెద నీవు దీని నేడు యు నెఱుంగనివాఁడవుగా నీకళేబ
రంబుఁ గొని చను మని పంచిన వినతుం డై యమ్మెదినీ
కాంతుండు. ౧౪౪

క. అక్షణమ శవము గొనిచని
భిక్షునకొగి నిచ్చుటయును బ్రియమున నీవ
ర్వక్షితియు నీవ యేలుచు
నక్షయ మగుపెంపుఁ బొందు మని దీవించెన్. ౧౪౫

వ. ఇట్లు తపోధనుండునుం బోలె నాశీర్వాదంబుచేసి. ౧౪౬

సీ. వివిధసత్సాధనవిరచితం బగుచు వి
చిత్రచిహ్నంబులచెలువు గలిగి
యుండెడు నయ్యగ్నికుండంబులనడుమ
నృపుతెచ్చినశవంబు నిలువఁబెట్టి
యాభిక్షుకుఁడు దక్షిణాభిముఖుం డయి
మహనీయ యనుమంత్రమహిమఁజేసి
వేతాళు నర్థి రావించి శవంబునం
దమర నిశ్చలమతి నావహించి
యరుణచందన కుసుమమాల్యముల నర్ఘ్య
ముఖ్యవిధులను బూజించి సౌఖ్యమెసఁగ
నధిప వేతాళపతికి సాష్టాంగవినతి
సేయు మిష్టార్థములు నిన్నుఁ జేరు నెందు. ౧౪౭

వ. అనవుడు. ౧౪౮

క. మ్రొక్కుఁగొనఁ గాని యొరులకు
మ్రొక్క యెఱుఁగ నాకుఁజూపు మ్రొక్కెడితెఱఁగే
మ్రొక్కెద మఱి యనవుడు విధి
ద్రెక్కొన సాష్టాంగ మున్నతిం జేయుటయున్. ౧౪౯

క. భూరమణుఁడు సంభ్రమమున
జోరసిచే భిక్షుశిరము దునిమి సుభక్తిన్
బోరున వేతాళున కుప
హారము గావించి ప్రణతుఁడై లేచి వెసన్. ౧౫౦

క. అతపసి పేరురంబును
హేతిశితాగ్రమునఁ జీరి హృత్పద్మమునన్

వేతాళుని బూజించెను
నాతఁడు గడు వరదుఁడయ్యె నాసమయమునన్. ౧౫౧

వ. పితృవననివాసుం డైన పరమేశ్వరుండు సర్వదేవపరివృతుం డై పుణ్యశ్లోకుం డగు నమ్మహీకాంతునకు సన్నిధిచేసి యతనికి విద్యాధరచక్రవర్తి పదం బొసంగి యంతర్హితుం డయ్యె నంతం బ్రభాతం బగుటయు మహేశ్వరప్రసాదంబున విద్యాధరులు వచ్చి తోడ్కొనిపోవ విద్యాధరచక్రవర్తి పదంబున కభిషిక్తుం డై నిజపురంబున కరుగుదెంచి యుభయరాజ్యసౌఖ్యంబుల ననుభవించుచుఁ బెంపొంద నక్కాలంబునందు. ౧౫౨

మ. అహిలోకంబునఁ బన్నగేశ్వరసముద్యత్కాంతిఁ బోషించుచున్, మహి దుగ్ధాబ్ధిహిమాగతారనగధామవ్రాతము ల్విస్ఫురన్మహిమం గూర్చుచు నింగి తారరుచులం బాలించుచు న్సర్వలోకహితుం డానరనాథుకీర్తి పరఁగెన్ గంగాప్రవాహాకృతిన్. ౧౫౩

క. అనుచుఁ ద్రివిక్రమసేనుని
వినుతచరిత్రంబుఁ జెప్పి వేతాళుఁడు నా
కును వాహనముగఁ జేయుట
కనుకూలం బైన మంత్ర మది దయ నిచ్చెన్. ౧౫౪

వ. ఆమంత్రం బత్యంతనిష్ఠతో ననుష్ఠించి తత్ప్రభావంబున వేతాళవాహనుండ నై వచ్చి దేవరం గాంచి ధన్యుండ నైతి ననిన నక్కుమారకేసరి విక్రమకేసరి నభినుతించి రానిచెలుల కెదురుచూచుచుఁ బూజ్యసామ్రాజ్యభోగంబు లనుభవించుచు నొక్కనాఁడు. ౧౫౫

శా. ఆపస్తంబపవిత్రసూత్ర హరితఖ్యాతాన్వవాయామృతా
కూపారామరభూజ భక్తివినతక్ష్మోణీశచూడామణీ
దీపారాధితపాదపీఠధరణీతేజఃప్రతిష్ఠాపన
వ్యాపారావతషట్సహస్రకులచూడాకల్పరత్నాంకురా.

క. మరకతమౌక్తికవిద్రుమ
కురువిందమహేంద్రనీలగోమేధిక వి
స్ఫురితమణిఖచితభూషణ
పరితోషణసుకవిలోక భవ్యవివేకా. ౧౫౭

ఉత్సాహ. బంధురప్రబంధబంధభవ్యనవ్యభాషణా
సింధుసమగభీరతావిశేషనిత్యభూషణా
సింధురాత్తప్రచురతురగసేవ్యవాజిశిక్షణా
బంధుమిత్రసుకవినికరపాలనావిచక్షణా. ౧౫౮

గద్యము. ఇది శ్రీమద్వెన్నెలకంటి సూరనామాత్యపుత్ర హరితసగోత్ర పవిత్ర సుకవిజనమైత్రీ విధేయ అన్నయనామధేయప్రణీతం బైన షోడశకుమారచరిత్రంబు నందుఁ బంచమాశ్వాసము.

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము.

## షష్ఠాశ్వాసము.

క. శ్రీహర్షముఖ్యసుకవిస
మాహితకావ్యప్రపంచమాధుర్యసుధా
గాహనలీలారసిక
వ్యాహారవిహార మంత్రియన్నయసూరా. ౧

సీ. దేదీప్యమానమై తేజరిల్లుచునున్న
మణిహేమమయసుధామండపమున
వివిధదేశాగతభువనాధినాథులు
బలసియిర్దిక్కులఁ గొలిచియుండ
జలజాయతాక్షులు చారుచామీకర
చమరవాలముల నందముగ నిడఁగ
నిందిందిరములకు విందులు గావించు
మాలతీకుసుమము లొమ్మాళిఁ దనర
నాసుధర్మలో దేవత లర్థిఁగొలువ
సమరకాంతలు వింజామరముల నిడఁగఁ
బారిజాతభూజాతపుష్పములు ముడిచి
యున్న యింద్రునిగతిఁ గొలువుండె విభుఁడు. ౨

3

వ. అయ్యవసరంబున.

సీ. చిత్తజాజ్ఞాలక్ష్మి చేతి పూసెలకట్టె
కరణి బెత్తము గేలఁ గరము మెఱయ
గనకకుంభములపైఁ గాయువెన్నెలవోలెఁ
జన్నులఁ జందనచర్చ దనరఁ
జపలాలతాసంగి శారదాభ్రమువోలెఁ
గట్టిన వెలిపట్టుపుట్ట మమర
వదనేందునకుఁ బొంచి యొదిఁగినరాహువనఁ
గక్షభాగమున ఖడ్గంబు వ్రేల
రమణి యై యున్నశృంగారరసమువోలె
నుర్విపైఁ గరజానువు లూంద మ్రొక్కి
యల్లనల్లన యాప్రతీహారకాంత
వినయ మెసఁగంగ నిట్లని విన్నవించె. ౪

చ. పలికెడుఁ బెక్కుదేశముల భాషలు నచ్చువడంగ సర్వవి
ద్యల విలసత్కవిత్వమునఁ దద్దయు మీఱెడు నెల్లవారు నిం
పుల విలసిల్లఁ బాడెడు నపూర్వముగా నొకచిల్క యొక్కఁ
డో,మలి గొనితేర వచ్చె గరిమంబున దేవరఁ గాంచువేడు
కన్. ౫

గీ. మాట లమృతరసముతేట లై పరఁగ వా
తెఱల కెంపు నింపు నెఱయఁ జేయఁ
జిలుకకంటె నొప్పు జలజాతలోచన
జలజనయనకంటెఁ జిలుక యొప్పు. ౬

వ. అనిన విని యమ్మహీపతి యత్యంతకుతూహలంబున మం
త్రులం గనుంగొని. ౭

క. చిలుక యటె పెక్కుభాషలఁ
బలికెడునఁట సరసమధురఫణితిఁ గవిత్వం
బులు చెప్పెడునఁట మఱియు
గ్గలమఁట యీచిత్ర మెందుఁ గలదే జగతిన్. ౮

వ. అనిన నత్తెఱంగతిచిత్రంబు రావించి యవధరింపు మనుట
యు నవ్విభునాజ్ఞం జేసి యప్రతీహారి యాకాంతం దోడ్కొ
ని తెచ్చి సమ్ముఖంబు సేయుటయు. ౯

చ. చిలుకకు దాది యైన సరసీరుహలోచన రాజసూతి కిం
పెలయఁగ మ్రొక్కెఁ బయ్యెద యొకించుక జాఱఁగ బాహు
మూలదీప్తులు లలిఁ ద్రుల్లియాడ సరిఁ దోరపుఁజన్ను లొ
కింత నిక్కఁగా, సులలితముద్రికారుచులు చూచుకరోచుల
మీఁదఁ జెందఁగన్. ౧౦

వ. ఇట్లు మ్రొక్కి తదనంతరంబ పరిచారికకరంబున నున్న రత్న
పంజరం బల్లన యందికొని. ౧౧

క. రాజితమణిపంజరయుత
రాజశుకముఁ బుచ్చి మనము రంజిల్లఁగ నా
రాజవరుమ్రోల నిడి యా
రాజానన యిట్టు లనియెఁ బ్రమదం బెసఁగన్. ౧౨

సీ. అష్టభాషల మధురాశువిస్తరచిత్ర
కవితలు చెప్పు సత్కవులు మెచ్చ
నామ్నాయములు నాల్గు నంగంబు లాఱును
నఖిలశాస్త్రంబులు నవగతములు
నూతనరీతుల ధాతువిభ్రమముల
రసములు మెఱయ వర్ణకము వాడు

నేపురాణంబుల నేకథ యడిగినం
దడఁబాటు లేక యేర్పడఁగఁ జెప్పి
నోలి నవధానములు వేనవేలు సూపు
శబ్దవిజ్ఞాని నైనను సరకుగొనదు
గౌతముని నైనఁ దొడరి తర్కమున గెలుచు
నవధరింపు మీకీరంబు నవనినాథ. ౧౩

వ. అని పలికినయనంతరంబ యారాజకీరంబు రాజు నవలోకించి.

ఉ. తామరచూలినెమ్మొగముదామరల న్మనునంచలేమ నె
త్తామరపూవుకోడ లెలదామరయిండులబొమ్మకొమ్మ వె
ల్దామరవన్నియ న్మెఱయుతల్లి యొకప్పుడు నీతలంపుఁద్రో
త్తామరలోన నెమ్మొగముదామర విప్పగ నుండుఁగావుతన్.

వ. అని యాశీర్వాదం బొనరించి ఋగ్యజుస్సామాథర్వణంబులయందు ను శిక్షాకల్పజ్యోతిర్నిరుక్తవ్యాకరణచ్ఛందంబులందు ను మీమాంసాదు లగుతత్త్వావబోధనంబులయందు ను బ్రాహ్మంబు శైవంబు పాద్మంబు వైష్ణవంబు భాగవతంబు భవిష్యత్తు నారదీయంబు మార్కండేయంబు నాగ్నేయంబు బ్రహ్మకైవర్తంబు లైంగంబు వారాహంబు స్కాందంబు వామనంబు గౌతమంబు గారుడంబు మాత్స్యంబు వాయవ్యంబు నను మహాపురాణములయందు ను, నారసింహంబు, నారదంబు, శివధర్మంబు, మాహేశ్వరంబు, గాలవంబు, మానవంబు, బ్రహ్మాండంబు, వారుణకాళికంబులు, సాంబంబు, సౌరంబు, మారీచంబు, కూర్మంబు, బ్రాహ్మభార్గవసారవైష్ణవంబులు నను నుపపురాణంబులయందు ను, సరసకవినిర్ణయంబు లగుకావ్యనాటకంబులయందు ను, సకలప్రసంగంబు

లయందు నుం దనకు నత్యంతపరిచయంబు గలుగుట తేటపడ నతిహృద్యవిద్యాగోష్ఠి యొనరించిన సకలజనంబులు నద్భుతానందకందళితమానసు లయి కనుంగొన రాజపుంగవుండు రాజకీరంబు నవలోకించి. ౧౬

క. ఏపీటనుండి వచ్చితి
వేవిధమున నీవుసేరి తీలేమకు నీ
కీ విద్యామాహాత్మ్యం
బేవిధమునఁ గలిగె నాకు నేర్పడఁ జెపుమా ౧౭

వ. అనుటయు. ౧౮

సీ. శ్రుతులు పుట్టినయిల్లు మతిజనంబులపంట
యాగమగోష్ఠీ విహారదేశ
మష్టమహాసిద్ధు లందెడుకందువ
పరమయోగీంద్రుల పట్టుఁగొమ్మ
సిద్ధసారస్వతసిద్ధి కావాలంబు
శబ్దశాస్త్రమునకు జన్మభూమి
నిశ్రేయసంబుల నిచ్చెన మహనీయ
మహిమలగని శ్రీల మనికిపట్టు
గరుడ గంధర్వ కిన్నరఖచరసిద్ధ
పన్నగామరకోటుల బ్రదుకుఁజోటు
సర్వసర్వంసహావిభూషణ మనంగఁ
దనరె శారదాపీఠంబు మనుజనాథ ౧౯

క. అందుండు భారతి శతా
నందసదానందకారణవికాసముతో

బృందారకబృందార్పిత
మందారలతాంతసురభిమందిర యగుచున్. ౨౦

గీ. అమ్మహాదేవి లీలావనాంతరమున
బాల్యమున నేను విహరింపఁ బరమయోగి
యొక్కరుఁడు వచ్చి కదలకయుం
... ... ... ౨౧

(ఇక్కడ గ్రంథపాతము)

ఉ. ... ... ... ...
... ... ... ...
... ... లనొల్లక నన్నెకోరెడుం
గావలయుం దదాప్తకృతిగాఁ దగునార్యఁ దలంచి చూడఁగన్

వ. అని నిశ్చయించి ధీరోదాత్తుం డగుట సభాజనుల సన్నిధి నడుగక యేకాంతంబున నడుగం దలంచి నానావిధభూషణ చీనాంబరంబులు నతిమధుర రసవత్ఫలంబులు నొసంగి శుకంబుతోడం గళావతిని వీడుపట్టున కనిచి సత్వరంబుగా మజ్జన భోజనంబు లొనరించి యేకతంబున నుండి కళావతిని రావించి యారాజశుకంబుతో ని ట్లనియె. ౨౩

క. శుకవర నీచదివినయా
ర్యకు రెండర్థములు గలిగినట్లున్నవి చె
ప్పక మాకుఁ దెలియకున్నది
ప్రకటంబుగఁ జెప్పు దీని భావము దెలియన్. ౨౪

వ. అనవుడు శుకం బి ట్లనియె. ౨౫

క. త్రిదశాధిపుపురిపోలిక
విదిశాపురి యొప్పు మాళవీవిలసనసం

పద నై లింపవధూజన
సదమలవిలసనముతోడ సరియై యునికిన్. ౨౬

క. ఆవీడు మేఘమాల
క్ష్మావల్లభుఁ డేలు నతని గాదిలిసుత హం
సావళి గతినిర్జితహం
సావళి యన నొప్పు మిగుల నవనీనాథా. ౨౭

సీ. కమలాక్షుచేపట్టు గలిగియు శంఖంబు
పూఁబోఁడికంఠంబుఁ బోలదయ్యె
నజునకుఁ బుట్టినిల్లయ్యునుం దామర
బాలికకనుదోయిఁ బోలదయ్యె
భవునాశ్రయించియుం బ్రాలేయకరరేఖ
లోలాక్షినిటలంబుఁ బోలదయ్యె
మదనుని గుణమయ్యు మధుకరమాలిక
పొలఁతికుంతలములఁ బోలదయ్యె
ననిన సర్వాంగవరవిలాసాభిరామ
యైన హంసావళికి నెనయైనసతులు
గలరె మనుజేంద్ర మూఁడులోకములయందు
నాలతాతన్వి తనుఁదాన పోలుఁగాని. ౨౮

గీ. చన్నుదోయి చాల నున్నతిఁ జెలువొందెఁ
బెరుఁగుఁ గటియు దాన పిన్న నడుముఁ
బడఁతినడుము సిగ్గువడి డాఁగెనోనాఁగ
నారుమాటునంద యడఁగియుండు. ౨౯

సీ. నెలచందురునికాంతి నెమ్మోముసృజియించి
యకలంకవిలసనం బలవరించి

కలువరేకుల మించు కన్నులు గావించి
నిత్యవికాసంబు నెలవుకొలిపి
చక్రవాకవిభాతిఁ జన్నులు గల్పించి
పాయనియొప్పులు పరఁగఁజేసి
కరికుంభవిస్ఫూర్తిఁ గటిచక్రమొనరించి
కొమరారునునుఁజిగి గుదురుకొలిపి
వనజభవుసృష్టి నిచ్చఁ గైకొనక తాన
మీనకేతుండు వేడ్క నిర్మించెఁ గాక
మూఁడుజగములఁ గలుగు పూఁబోఁడులందు
మాళవేశ్వరకన్యకఁ బోలఁగలరె. ౩౦

గీ. కాంతమెఱుఁగుఁజన్నుఁ గవయును బొదలింపఁ
గుందెఁ గంటె కుంభికుంభయుగము
లేమి పొదుపుసేయ నేమగునో యని
నడుము సన్నముగ నొనర్చె నజుఁడు. ౩౧

సీ. కరతలంబులయొప్పు సరసిజంబులఁ బోల
నెఱచందురుని బోలె నెమ్మొగంబు
తనువుటూర్పులయింపు గనుఁగాలి మించిన
నవరోమరేఖ పన్నగము మించె
నలకలు తేఁటుల చెలువంబు గెలువ నా
సికయొప్పు హేమపుష్పకము గెలిచె
ఘనకుచంబులు శైలగరిమంబు మీఱిన
రదనదీప్తులు వజ్రరశ్మి మీఱెఁ
గారణమ్ములేక కడుఁబరస్పరవైర
మయ్యె నొక్క మేనియందె యిప్పు

డవయవముల కనుచు నతిచింత డస్సెనా
నడుము సన్న మయ్యె నలినముఖికి. ౩౨

వ. అని మఱియు బహుప్రకారంబుల నయ్యంబుజవదనవిలసనం
బభినందించి యయ్యిందువదన న న్నెఱింగిన తెఱం గవధరిం
పు మని యి ట్లనియె. 33

క. సిద్ధులచే సను బడసి స
మిద్ధగరిమఁ బొందెఁ గాన యీయింతి గడుఁ
శుద్ధమతి నెల్లనాఁడును
సిద్ధారాధనముఁ దగఁ బ్రసిద్ధిగఁ జేయున్. 34

క. అదికారణంబుగా మా
సదనమునకు సిద్ధులెల్లఁ జనుదెంచుట నొ
క్కదినంబున సిద్ధుఁ డొకఁడు
సదమలతేజుండు వచ్చి సంభావితుఁడై. 35

క. అనుపమువని తారూపం
బును మోహనపురుషరూపమును బాగుగ వ్రా
సినపట మాతనిహ స్తం
బున నుండఁగఁ గాంచి వినయమున ని ట్లంటిన్. 36.

క. ఈవిధముల యొప్పిదములు
భూవలయములోనఁ గలుగఁబోలవు దేవా
యేవారి రూపులొకో యివి
నావుడు ని ట్లనియె నాననము వికసిల్లన్. 37

క. ఆకాశగతి యదృశ్యత
యాకర్షణవిద్య మాకు నలవడియుండుఁ

లోకవిశేషంబు లద్భు
తాకారతతోడఁ జూచి యఖిలమునందున్. ౩౯

క. సకలజనమోహనాకృతి
నొకపురుషుని నొక్కచోట నుజ్జ్వలరూపా
ధిక నొక రమణీరత్నము
నొకచోటం జూచి యభినవోల్లాసమునన్. ౩౯

క. నిను సిద్ధులచేఁ బలుమఱు
వినియునికిని నీకుఁ జూపు వేడుకమై వ్రా
సినవాఁడఁ జూడు మని ప్రియ
మెనయంగా నాకుఁజూపి యి ట్లని పలికెన్. ౪౦

క. ఈరూపువాఁడు సోమకు
లారూఢుఁడు రాజమకుటహారిమణీవి
స్ఫారపదాంభోజమహో
దారుఁడు కమలాకరాభిధానుఁడు జగతిన్. ౪౧

క. ఈరూపుచెలువ మాళవ
భూరమణుని కన్య సకలభూభువనలస
న్నారీతిలక మనఁగఁ బెం
పారిన హంసావళీసమాహ్వయ చిలుకా. ౪౨

క. నిత్యముగా వారికి దాం
పత్యము సమకూరెనేని భావజరతిదాం
పత్యము విష్ణురమాదాం
పత్యమునుం బోలె నెందుఁ బ్రస్తుతికెక్కున్. ౪౩

క. నలునిదమయంతిఁ గూర్చిన
కలహంసము వోలె నీవు గాంచెదు కీర్తుల్

చిలుకా పలుకులనేర్పులు
తొలఁకాడఁగఁ గూర్పు మిప్పధూవరులఁ దగన్. ౪౪

వ. అనిచెప్పి యప్పురుషవరుండు నిజేచ్ఛనరిగిన. ౪౫

క. మిమ్మిరువురఁ దగఁ గూర్పఁగ
నెమ్మనమున వేడ్క నాకు నెగడుటయును నీ
కొమ్మ నను దోడుకొనిచన
నమ్మాళవరాజుపురికి నరిగితి మధిపా. ౪౬

సీ. హేలాసమాగతమాళవీలోచన
ద్విగుణీకృతోత్పలవిలసనంబు
నీరజమకరందనిష్యందవర్ధిత
వాఃపూరపూర్ణప్రవాహమహిమ
సలిలసంగ్రహణార్థసంగికాదంబినీ
కాదంబకకదంబమేదురంబు
పానీయపానగతానేకఘోటక
ప్రతిభటోత్తుంగతరంగరాజి
యగుచు లోచనానందసమగ్రగరిమఁ
బరఁగువేత్రవతీనది పరిఘ గాఁగ
ధారుణి సమస్తపురవరోత్తంస మగుచుఁ
దనరునవ్విదిశాపురి ధరణినాథ! ౪౭

వ. ఏ మప్పురంబు సొచ్చి యందుల యొప్పిదంబులు గన్నుల
పండువులుసేయుచుండ రాజమందిరంబున కరిగి. ౪౮

సీ. దౌవారికాలోకధవళమరీచులు
నవ్యమౌక్తికతోరణములు గాఁగ

ద్వారదారుస్థితగారుత్మతద్యుతి
లలితరంభాస్తంభకలన గాఁగ
దేహళీకలితసందీప్తవజ్రంబులు
రంగవల్లీజాలరచన గాఁగ
నుపరిభాగస్థాపితోజ్జ్వలరత్నమం
డలములు నవదర్పణములు గాఁగ
సహజశోభ నలంకారమహిమ మెఱయ
నంద మొందు తద్వారంబు నందు నిలిచి
ధారుణీశులు గొలువ నొప్పారువాని
పునకు మారాక యెఱిఁగించి పుచ్చుటయును. ౪౯

వ. నూతనకౌతుకంబున మమ్ముం గానుపించుకొని బహుమానం
బొనరించి. ౫౦

క. దిన మెల్లను మాగోష్ఠిన
యనురాగరసాబ్ధి నోలలాడుచు మాకుం
గనకాంబరమణిభూషణ
ఘనరసవత్ఫలము లిచ్చి గౌరవ మెసఁగన్. ౫౧

వ. సకలసంవిధానంబులు సేయించి మాకు నొక్కమణిహర్మ్యం
బు విడిదల నిచ్చిన నుండి మఱునాఁడు. ౫౨

సీ. హాటకరచితకవాటనాసాళిలా
శోభితప్రతిహారసుందరంబు
మణికీలితవిటంకమానితస్తంభాగ్ర
గోపానసీసుప్రదీపితంబు
నవకీరతురగాదినవ్యమనోహర
బహురూపచిత్రవిభ్రాజితంబు

రత్నరాజితచిత్రరంగవల్లీజాల
రంగత్ప్రభాభాసిరంగతలము
సకలదిక్పాలచిత్రరూపాంచితంబు
సర్వలక్షణశోభితసన్నుతంబు
నై నహంసావళీకన్యయాటయింటి
కరిగితిమి తద్విశేషంబు లపరిమితము. ౫౩

క. అమలమణికుట్టిమంబులఁ
దమనీడలు చూచి పోటితండం బనుచున్
రమణామెయిఁ జేరుముగ్ధ
ప్రమదల నవ్వుదురు ప్రౌఢభామాజనముల్. ౫౪

గీ. చిత్రసరసులలోఁ బ్రాసి చెలువు మిగులు
హంసబృందంబుఁ గనుఁగొని యర్థితోడఁ
బోటిరాయంచపదువులు వోవఁ జేర
నిక్కువపుహంసలా యని నృపకుమార. ౫౫

వ. ఇట్లతిరమ్యం బయిన నాట్యభవనం బంతయుం గలయం గనుంగొని యం దొక్కరుచిరకుడ్యభాగంబున భవదీయమనోహరాకారం బచ్చుపడ వ్రాసి యచ్చోటు వాసి చని విడిదల నున్నంత హంసావళి యచ్చటికిం జని యచ్చిత్రరూపంబుం గనుంగొని యత్యంతమనోహరంబు లగుతద్విలాసంబులం దగిలి చూచి పచ్చవిలుతుబారిం బొటి యే నారూపంబు లిఖియించుట యచ్చటిజనంబులవలన విని పరిచారికలచేతం దనపాలికి నన్నుం బిలిపించికొని సముచితసంభావనంబు లొనరించి భవద్రూపచిత్రరూపంబుఁ జూపి యిట్లనియె.

క. చిలుకా యిట్టివిలాసము
గలపురుషుఁడు జగమునందుఁ గలఁడో యీయు
జ్జ్వలరూపము నీకరకా
శలము మెఱయ వ్రాసితో నిజంబుగఁ జెపుమా. ౫౭

వ. అనిన నానేర్పువిధంబును దేవరయన్వయనామధేయవిలాస
రాజ్యవైభవంబులు వినిపించి మనోభవాధీనమానసం గా
వించిన నతిప్రయత్నంబున నీచీనాంబరంబునందుం దాన
యీయార్య లిఖియించి యిచ్చి నాకు వివిధవిశేషసంభావ
నంబు లొనరించి పుత్తేర నిచ్చటికి వచ్చితి నని యీయార్యా
క్షరపంక్తి మనోహరం బైనకళావతీకరస్థం బగునంబరం బ
వ్విభునిముందటం బెట్టి యవధరింపు మనిన వేడ్కలు సంద
డింపం గరంబు చాఁచి యందుకొని. ౫౮

క. పద్యము రెండర్థములను
హృద్యం బగుటకును వ్రాల యొకొప్పునకుం
జోద్యముఁ బొందికరంగుచు
నుద్యత్పులకాంగుఁ డగుచు నున్నంత వెసన్. ౫౯

క. కీరత దొఱంగి యది గుణ
నీరధి యగుతమవివేకనిధి యై తనకుఁ
బోరునఁ బ్రణమిల్లుటయును
భూరమణుం డద్భుతంబుఁ బొందినమదితోన్. ౬౦

వ. దిగ్గన సింహాసనంబు డిగ్గి యిచ్చ యలరం గవుంగిలించుకొని
తా నెప్పటియట్ల యాసీనుం డై యతని సముచితాసనంబు
న నునిచికొని యాక్షణంబ భీమభటాదు లగుమంత్రుల రా
వించిన వార లతనిం గని ప్రమోదమానసు లై పరిరంభ

ణంబు లాచరించి రయ్యెందఱ నుచితాసనంబుల నుండ ని
యమించి సకలవిద్యాధారం బగుకీరంబు వివేకనిధి యగుటఁ
జెప్పి యతని నవలోకించి నీ వింతతడవు శుకంబ వై యుండి
సహజాకారంబు దాల్చుటకుం గారణం బేమి యని యడి
గిన ముకుళితకరకమలుం డై యతం డిట్లనియె. ౬౧

గీ. ఉరగకోపంబుచేత నాతురతఁ బొంది
మిగుల దవ్వుగ నేగి కాశ్మీరభూమి
శారదపురంబునకుఁ గొంత చేరు వైన
కానలోఁ దప మొనరించుమౌనిఁ గాంచి. ౬౨

ఉ. అతఁడు మౌనసన్నియతుఁ డౌట యెఱుంగఁగనీనియట్టి కా
ర్యాతురవృత్తి నానతుఁడ నై ననునేలినరాజు నాసఖి
వ్రాతము నెట్లు గాంతు మునివల్లభ యానతి యీఁగదే కృ
పాన్వితత నంచు నెగ్గడర వేమఱు మౌనకవేఁడఁజొచ్చినన్.

వ. సమాధివైకల్యంబునకుఁ గోపంబు దీపించిన. ౬౪

క. బాలిశవృత్తిం బలుమఱుఁ
బ్రేలి నియమవిఘ్న మాచరించితి నాకుఁ
బాలశుకంబవు గమ్మని
చాలం గృపమాలి మౌని శాప మొసఁగినన్. ౬౫

చ. అమితభయంబు నందుచుఁ దదంఘ్రులకుం బ్రణమిల్లి కా
ర్యద్రోహమున భవన్మహానియమ మాత్మ నెఱుంగక వేఁ
డికొంటిఁ గాని మదము నొంది కా దిదియ నిశ్చయ మి
త్తెఱఁ గీవు దివ్యబోధమునఁ దలంచి చూచి కృప దప్పక
నన్ను ననుగ్రహింపవే. ౬౬

చ. అనవుడు దివ్యదృష్టి ననఘాత్ముని గా ననుఁ జూచి యత్తపో
ధనుఁడు కుమార ! నాపలుకు దప్పదు బాలశుకంబ వైన నీ
కనవరతంబు సత్ఫలము లాదటఁ బెట్టుచుఁ బెంప దిక్కు గ
ల్గు నఖలవిద్యలందు నధికుండవు సౌదు ద్విమాసమాత్రలోన్

సీ. రాజకీరంబ వై యాజన్మవిధ మెఱుం
గకయున్న నాయనుగ్రహమువలన
నెమ్మి మై నొకనాతి నినుఁ గొనిపోవంగ
ఘనరాజ్యమహిమలఁ దనరుచున్న
మీరాజుకడ కేగి యారాజు గోరెడు
మగువయొప్పులును బ్రేమంబుఁ జెప్పి
యాక్షణంబునన శుకాకృతిఁ బెడఁబాసి
యారూపు ధరియించి యధిపుతోడ
నర్థి నీచెలులఁ గని యత్యంతమహిమఁ
బరఁగు దని సుప్రసన్నతఁ బలికె నాతఁ
డంతనుండి యి ట్లైతి లో నతని నెఱుఁగ
నధిప మిముఁ గాంచి ధన్యుఁడ నైతి ననిన. ౬౮

వ. ఇచ్చ నచ్చెరు వందుచు నత్తఱి నత్తెఱంగునకుం జింతా
క్రాంత మై యున్న కళావతిం గనుంగొని నీవు నెమ్మనంబు
న నమ్మలికంబు నొందకుము సర్వజ్ఞత్వంబున నీచిలుక య
గునట్టిచిలుకం గలిగించి నీ కిచ్చెద మని యూఱడించి చిత్ర
కరు నవలోకించిన నమ్మహాచతురుండు. ౬౯

క. వెలసిన సర్వజ్ఞతచేఁ
జెలువశుకముఁ బోలునట్టిచిలుకవు గమ్మం

చిల నొక్కశుకాకారముఁ
జెలువారఁగ నాత్మయష్టిచే వ్రాయుటయున్. ౨౦

క. అచ్చిలుక తాన క్రమ్మఱ
నచ్చుటఁ బొడసూపినట్టు లఖిలజ్ఞతయుఁ
మెచ్చులమాటలుఁ దొల్లిటి
యచ్చుగ నొకరాజకీర మచ్చుటఁ బొడమన్. ౨౧

క. ఆరాజశుకము వేడుక
నారాజాననకు నిచ్చి యద్భుతమోద
శ్రీరంజిల్లుట కలరుచు
నారాజవరేణ్యుఁ డభిమతార్థము లిచ్చెన్. ౨౨

వ. ఇచ్చి సముచితప్రకారంబుల వీడుకొలిపి హంసావళివలని కోరికలు గుఱి* కొలుపఁ దద్దిగ్విజయంబు నెపంబున నవ్వారంబునకుం జన నిశ్చయించి సకలదండనాథుల దండయాత్రకు నియమించి ప్రయాణభేరి వేయించిన. 23

సీ. ఉలికివాహములు లంకెలు వైచుకొనుటయు
నినుఁడు సారథికిఁ దో డెత్తఁగడఁగె
వననిధి పిండలివండుగాఁ గలఁగినఁ
బెనురొంపి నౌర్వాగ్ని పొనుఁగుపడియె
మూర్ఛిల్లి ఫణికూర్మములు మీఁద వ్రాలిన
మొదలిశక్తికి మెడ గుదియఁబడియె
మేదిని వడఁకిన మేదినీధరగండ
శైలంబు లందంద రాలఁదొడఁగె

* గొరికొలుప-మూ. బురికొలుప?

దిక్కు లల్లాడె ధర క్రుంగె దిగ్గజములు
అఖిలమును నిండి బ్రహ్మాండ మవియఁ జేయఁ
గనకకోణసంతాడితఘనతరప్ర
యాణభేరీమహారావ మడరుటయును. 24

వ. ఇట్లు ప్రస్థానభేరీరవంబు చెలంగ సైన్యంబు సలుగడ నడవం
దొడంగిన. 25

సీ. ఘనరేణువులు గప్పి ఖచరవిమానముల్
మంటిముద్దలు వోలె మింటఁ దనర
దట్టంపురజములఁ దారకంబులు క్రుంగి
యవనిఁ బాఁతినముత్తియములఁ బోల
మెలఁగ మిడుకరాక మేఘవర్గంబులు
దట్టంపుధూళిచేఁ దల్లడిల్లఁ
బాంసువు వొగివినం బర్వతప్రకరంబు
దూబలలాగునఁ దోఁచుచుండ
దరువులెల్లను రూపేది చొరువు లయ్యె
నదవులన్నియు బడితల గెడవు లయ్యె
మెట్టలన్నియుఁ జెడి కాలుమెట్టు లయ్యె
నరవరేణ్యుని సైన్యంబు నడచుటయును. 26

—♦ ప్రభాకరుని కథ ♦—

వ. ఇట్లతిభయంకరం బగు సైన్యంబునడచి నడచి యొక్కయతి
రమ్యస్థలంబున విడిదల గావించి మంత్రుల రావించి కొలు
విచ్చి సముచితసల్లాపం బొనరించు సమయంబున గగనం
బున నరిగి యరిగి యత్యుజ్జ్వలప్రభావిరాజమానం బగు వి
మానం బొక్కటి యాకొలువుచక్కటిం గొంతతడవు నిలిచి

తదనంతరంబ తత్ప్రాంతంబున నవతరించినం గనుంగొని
డెందంబున నద్భుతంబు నొందె. ౨౭

సీ. ఈవిమానంబు గలుగువాఁ డెవ్వఁ డగునొ
యేమికతమున వచ్చెనో యిప్పు డనుచు
నందఱును నవ్వలన చూచునంతలోన
నవ్విమానంబు డిగి తేజ మతిశయిల్ల. ౨౮

క. తమచెలియైన ప్రభాకరుఁ
డమితానందంబుతోడ నరుదెంచిన భూ
రమణుఁడును మంత్రులు డెం
దమునఁ బ్రమోదంబు నద్భుతముఁ దనరారన్. ౨౯

వ. సముద్ధితు లగునంత సంతసంబునఁ బఱతెంచి భూపాలునకుం బ్రణామంబాచరించి యతని కౌఁగిలి వడసి క్రమంబున భీమభటాదులం బరిరంభణం బాచరించి యనంతరంబ సింహాసనంబున నాసీనుండై కమలాకరుండు ప్రత్యేకంబు నందఱ నిజాసనాసీనులం గావించి ప్రభాకరునకు సముచితాసనంబు వెట్టించి యతనివదనంబునం జూడ్కి నిలిపి నీకు విమానయానం బెట్లు గలిగె నని యడిగినం గరంబులు మొగిడిచి.

క. భూనాథ మిమ్ముఁ గానక
దీనతఁ గాననములోనఁ దిరుగుచు నొకచో
మౌనీంద్రు నొకనిఁ గనుఁగొని
యానతి యొనరింప నాతఁ డాదర మెసఁగన్. ౩౧

క. తనదివ్యబోధమున నా
మనమువిధం బెల్ల నెఱిఁగి మది వగవకు మీ

జనపతిఁ గలసెదు నలువురు
వనితల వరియించి మహితవైభవనిధి వై. ౧౨

క. ధర వర్ధమానపురమునఁ
బరోపకారి యనుధరణిపాలుఁడు గలఁ డా
నరపతి తనసుత యెవ్వని
వరియింపక యున్న నాత్మ వగ గదురంగన్. ౧౩

సీ. నరులకు దూర మై పరువంపునెత్తావిఁ
గొమరు మీఱెడుపువ్వగుత్తి వోలెఁ
బుడమి నెవ్వరికిఁ జేపడక యుజ్జ్వలభాతిఁ
బంబినపెన్నిధానంబు వోలెఁ
గనకసంగతి లేక ఘనకాంతి నొప్పునం
దనరారుమహితరత్నంబు వోలె
జనులదృష్టికి నగోచర మయి కడవలో
వెలుఁ గొందుఘనదీపకళిక వోలె
వరునిపొందు లేకున్నది వారిజాక్షి
యడవిఁ గాసినవెన్నెల యగునొ యింకఁ
దరుణిజవ్వన మనుచుఁ జింతాసముద్ర
మగ్నుఁ డై యున్నవాఁడు కుమారచంద్ర. ౧౪

క. ఆనెలఁతఁ గోరి తిరుగుము
నానాయాసములుఁ బొంది నలుగురువిలస
న్మానినులకుఁ బతి వై మీ
భూనాథునిఁ జెలులఁ గాంతు పొమ్మని పనుపన్. ౧౫

వ. ఆమునీంద్రునకు వినతుండ నై చని వర్ధమానపురంబుం జొ
చ్చుసమయంబున. ౧౬

క. కనకపురిఁ గనినవారికిఁ
దనపుత్త్రిక గగనలేఖఁ దగుధనములతో
మనుజేంద్రుం డొసఁగుదు నని
చను తెలుఁగఁగ నగరవీథిఁ జాటఁ బనిచినన్. ౮౭

శా. ఏచందంబున నబ్బునో యుజల యం చే నాత్మ నూహింపఁ
గా, నా చా టప్పుడు నాదుకర్ణముల కత్యానంద మొందిం
చిన, న్వాచాలత్వ మెలర్ప హేమపురము న్వర్ణించి యేఁ
గంటి నం, చాచంద్రాస్య వరించువాఁడ నిది కార్యం బం
చు ధైర్యంబునన్. ౮౮

వ. సముచితాలంకారశోభితుండ నై రాజమందిరద్వారంబున
కరిగి ప్రతీహారపాలు నాలోకించి. ౮౯

క. కనకపురం బేఁ జూచితి
ననుటయు వాఁ డపుడు నన్ను నధిపతికడకుం
గొనిపోవ నాతఁ డుబ్బుచుఁ
దనపుత్త్రిక మ్రోల నిలిపెఁ దద్దయువేడ్కన్. ౯౦

సీ. కామినీనీలాలకములఁ జిక్కినవేడ్క
బలిమి నేకరణిని బాపరాక
సతియుఱుక్కుఁజన్నులసందుఁ దూఱినచూడ్కి
ధీరతఁ గదలించి తెలియరాక
పడఁతుకకౌఁదీవఁ దొడివడ్డభావంబు
నెట్టును నిలువంగఁబట్టరాక
భామినిగురునితంబంబు నెక్కినమది
నేచందమున దిగియింపరాక

కోరిక లెలర్ప భావజుబారిఁ బాటి
ప్రేమ దనరార భువనాభిరామ మైన
యవ్విలాసినిచెలువంబునందుఁ దగిలి
నన్ను మఱచి యుండితి నరనాథచంద్ర. ౯౧

వ. ఆసమయంబున. ౯౨

క. అప్పొలఁతి కనకనగరం
బెప్పగిదిం బొలుచు ననిన నే యుక్తిమెయిం
జెప్పితిఁ గొన్నివిశేషము
లప్పురిచెలువంబు లనుచు నంగనతోడన్. ౯౩

క. నామాటలు విని నవ్వుచుఁ
గామిని గడుధూర్తు వీఁడు గారులు పలికెఁ
హేమనగరంబున విధం
బేమియు నెఱుఁగఁ డని పలికి యెంతయునలుకన్. ౯౪

క. నను వెడలఁగఁ ద్రోపించిన
మనమునఁ జింతిలక నానిమాట యమోఘం
బని తలఁచి యతనిచేతను
కనకపురముజాడ యెఱుఁగఁగాఁ గోరి వడిన్. ౯౫

క. ఏనును మునివరుఁ గాంచిన
యానెలవున కేగి యచట నామహితాత్ముం
గానక పూనిక మానక
కానఁ గలయ నంత దిరుగఁగా నొక్కయెడన్. ౯౬

క. మునివరుఁడుం......దప
మొనరింపఁగఁ గాంచి వినతి యొనరించి జగం

బున నేదేశములోనిది
కనకపురము చెప్ప వయ్య కరుణ ననుటయున్. ౯౭

సీ. కనకపురంబుఁ గన్గొనినవారును విన్న
వారును గలుగ రివ్వసుధలోన
వసధిలో నుత్కటం బనుదీవియందు న
త్యద్భుతంబు గలదు దాశరాజు
గలఁ డతఁ డీధాత్రిఁ గలపట్టణంబుల
నన్నియు నెఱుఁగు వాఁ డున్న యెడకు
నరిగి యాపురము నీ వడుగంగఁ జెప్పెడుఁ
బొమ్మన వినతితో నమ్మునీంద్రు
వీడుకొని బహుపర్వతవిపినరాష్ట్ర
పంక్తిఁ దఱియించి యొకకరపట్టణమున
కరిగి యాద్వీపమునకుఁ దా నరుగువారి
నెమ్మిఁ దడవంగ దైవయోగమ్మునందు. ౯౮

క. అనఘుఁడు సముద్రదత్తుం
డనువైశ్యుం డందుఁ జనఁగ నాయితపడునా
తనిఁగూడి యతఁడు నేనును
ననుఁగుల మై యోడ యెక్కి యరిగెదు వేళన్. ౯౯

క. శ్రీలలనాధీశ్వరు నఱ
కాలఁ దనరుతిలక మనఁగఁ గడు మెఱసి లస
న్నీలాభ్రఖండ మొక్కటి
యాలోనం బ్రబలె దుర్జనాపద వోలెన్. ౧౦౦

క. అంభోదపటలదర్శన
సంభవపవనోద్గవిపులజలపూరముచే

నంభోధరమార్గం బపు
డంభోనిధిభంగి నుండె నతిభయదం బై. ౧౧౧

సీ. వితతవర్ణవితీర్ణవిద్రుమవల్లులు
పరఁగెడుఘనజటాపంక్తి దోరయ
నంబుపానసమాగతాంబుదపటలంబు
దనరారుకుంజరాజనము గాఁగఁ
బ్రబలవాతోద్ధూతభంగసంఘంబులు
విస్తరిల్లెడుహస్తవితతిఁ బోల
ఘోరతరస్ఫురద్ఘుమఘుమాఘోషణం
బారభటీభాతి నతిశయిల్లఁ
బ్రళయకాలతాండవలీలఁ బ్రజ్వరిల్లు
ఫాలలోచను నుగ్రరూపంబు వోలె
నంబరంబును దిక్కులు నాక్రమించి
యతిభయంకర మయ్యె నాయంబుధంబు. ౧౧౨

వ. ఆలో నమ్మహావాయువు తలక్రిందుగా ద్రోసిన. ౧౧౩

క. కలజను లందఱు నొంతయుఁ
గలకలమున నార్తిఁ బొందఁ గల మవియంగాఁ
గలఁగక సముద్రదత్తుఁడు
పలక యొకటి వట్టి యీఁదెఁ బటుధైర్యమునన్. ౧౧౪

క. నను నప్పు డొక్కమీనము
గని మ్రింగుట నల్ల దాని ఘనతరకుక్షిం
దనువై కల్యము నొందక
యనపాయత నుండితిం జిరాయువు కలిమిన్. ౧౧౫

శా. నాపుణ్యంబున నొక్కజాలరి వలం దన్మత్స్యముం బట్టి గ
ర్భాపాయం బొనరించి నన్నుఁ గని యత్యాశ్చర్యముం బొం
ది యత్యాపన్నత్వముతోను దన్నడుగఁ దా నద్దీవిపే రు
త్కటద్వీపం బన్న విధి న్నుతించి కడుఁ బ్రీతిం బొందు
టె.దంబుతోన్. ౧౦౬

క. యతిపతిచెప్పిన సత్య
వ్రతుఁ డనఁవృద్ధుకడ కేగి వానికి నేఁ జె
ప్పితి నాదగు వృత్తాంతం
బతఁ డెఱతయుఁ జోద్యపడఁగ నాద్యంతంబున్. ౧౦౭

క. నామాటలు విని దాశ
గ్రామణి కనకాఖ్యపురము గల దిల ననఁగా
నేము వినము వినకున్నను
నే మగు విను మప్పురంబు నెఱుఁగు తెఱంగున్. ౧౦౮

ఉ. దీవులవార లెల్లఁ జనుదెంతురు వారసి గాఁగ నెల్లి ల
క్ష్మీమవిభుఁ గొల్వ నచ్చటికిఁ జేరువఁ బుష్కరనామసంజ్ఞ మ
న్దీవికి హేమపట్టణము నిశ్చయ మద్ది యెఱుంగవచ్చు వే
నీవును నేను నచ్చటికి నేగుద మంచుఁ బరోపకారతన్.

క. నను నాదీవికిఁ దోడ్కొని
వననిధినడుమ నరుగ నొక వటముసమీపం
బున నోడ దైవవశమున
ఘనమగునుడిఁ బడిన నేను గంపింపంగన్. ౧౧౦

గీ. చలన మొందక యవ్వటశాఖఁబట్టి
వేగ మెక్కి కలము సుడి వెడలఁదెచ్చి

నిన్ను నెక్కించుకొనియెద నన్న నట్లు
యతిరయంబున నెక్కితి నక్కజంబు. ౧౧౧

క. సుడివెంపర వడి ముంపఁగ
వెడలింపఁగరాక దాశవిభుఁడు వివశుఁడై
జడనిధిఁ గలంబుతోడన
పొడవడఁగెను నాదుమనము పురపురఁబొక్కన్. ౧౧౨

వ. ఆలోన లో నార్తిం బొంది యి ట్లంటిని. ౧౧౩

మ. చెలులం గానక కానలోఁ దిరుగఁగాఁ జేమాయల న్మాని
నుల్, వలలం బెట్టిన నిక్కవంబు లనుచు న్వాంఛారతి న్వ
చ్చి యా, పలుపాటు ల్వడి వీనిఁ జేరి యితఁడుం బాపంబు
దైవంబుచేఁ, బొలియంగా నిటు దిక్కుమాలుదునె యంభో
రాశిమధ్యంబునన్. ౧౧౪

క. తరుణుల వరించి కనియెద
ధరణీశ్వరు ననినయాస దైవము చెఱచెఁ
మరణము శరణని యంతః
కరణంబున నిశ్చయింపఁగా నట్టియెడన్. ౧౧౫

వ. ఆక్రోశంబుదనర నాకాశవాణి యి ట్లనియె యక్షుం డొక్క
రుండొక్క మహామునిశాపంబున నిచ్చట నీవృక్షంబై నిలిచె
నీవు దొఱంగిపోయిన శాపమోక్షంబు నొందెను నీవు మర
ణోద్యోగంబు మాని నేఁ డీతరువున వసియింపు మెల్లి కనక
పురంబుఁ గనియెద వనిన నద్భుతం బంది యదియుం జూచె
దఁగాక యని యున్నంతను. ౧౧౬

క. భూపాల నాఁటిరాత్రి మ
హాపక్షులు గొన్ని వచ్చి యందలిఘనశా

ఖావం క్తి నంది యాశ్చ
ర్యాపాదనమున్నతో జ్జ్వలాకారమునన్. ౧౧౭

వ. అట్టుండి యమ్మహావిహంగంబు లెల్ల రేవకడఁ గదలి కనక
పురంబునకుం బోద మని తమలో మనుష్యభాషల సంభా
షించిన సంతోషించి. ౧౧౮

క. అం దొక్కపక్షిరెక్కల
సం దల్లనఁ దూఱి నెమ్మి శయనించితి నేఁ
జెంది వసించుట యించుక
యుం దెలియకయుండె దాని కురుతనువగుటన్. ౧౧౯

క. వేవినఁ గద లెఱుఁగుచు నే
నీవిక్రొని వసింపఁ బక్షు లెల్లను జనఁగా
నావిహగము చని కనకపు
రీవృక్షమునందు నిలువఁ బ్రియమెసలారన్. ౧౨౦

క. ఆపులుఁగుఱేనిఱెక్కల
లోపల మెలపార వెడలి లోచనపర్వం
బై పూర్ణగరిమఁ దనరెడు
నాపురముం జొచ్చి వీధినరిగెడువేళన్. ౧౨౧

క. మేడపయినుండి కనుఁగొని
వేడుక యెసలార నొక్కవెలఁది వనుపఁగాఁ
బ్రోడచెలి వచ్చి నన్నుం
దోడుకొనుచు నరిగె నవ్వధూమణికడకున్. ౧౨౨

వ. అప్పుడు. ౧౨౩

సీ. జిగిదొలఁకాడెడు చిగురాకుఁగెమ్మోవి
పగడంపుఁదీఁగెల బాగుఁ దెగడ

నిడువాలుఁగన్నుల నెఱయు క్రొమ్మించులు
దొలుకారు మెఱుఁగుల చెలువుగెలువఁ
జెన్ను దొలంకెడు చిఱునవ్వునెమ్మోము
నిండుఁజందురునకు నెఱసు చూప
నునుమించు పచరించు ఘనకుచయుగళంబు
కనకకుంభంబుల గారవింపఁ
బలుకనేర్చిన కనకంపుఁ బ్రతిమవోలె
రామయై యొప్పు శృంగారరసమునంగ
నఖిలమోహనమూర్తియై యతిశయిల్లు
నన్నలినగంధిఁ బొడగంటిఁ గన్నులలర. ౧౨౮

క. ననుఁ గనుఁగొని యయ్యంగన
యనురాగముఁ గౌతుకంబు నలవడ సంభా
వనము లొనరించి మదిలో
ననురాగము బెరయ నిట్టు లనియె న్నాతోన్. ౧౨౯

సీ. వీరచూడుఁ డనెడువిద్యాధరుఁడు గాంచె
వనితల నలువుర వారిలోన
నగ్రజఁ జంద్రప్రభాఖ్యనైఁ దనరుదు
నాతోడఁ బుట్టిననలినముఖులు
పద్మరేఖయు శశిప్రభయును సుప్రభ
యును ననువారల ముని శపింప
భూమిపై జనియించి పుట్టెఱింగినవారు
వారలఁ బాసినవగపుచేత
వనమునకు నేగెఁ దపసినై జనకుఁ డిప్పు
డేను జెలియంద్రరాకకు నెదురుచూచు

చున్నదాన మనంబున నొండుతలఁపు
మాని బోటులతోడఁ గుమారచంద్ర. ౧౨౮

క. నరుఁ డొకరుం డాతురుఁడై
నిరుపమవిలసనుఁడు వచ్చి నిన్నును నీసో
దరులను వరించు నని శాం
కరి యానతి యిచ్చె నాకుఁ గరుణదలిర్పన్. ౧౨౯

ఉ. అంబిక యాన తిచ్చినసమగ్రవిలాసివి నీవ కాఁగ డెం
దంబున నిశ్చయించి ప్రమదంబు వహించితి ని న్వరింతు నె
య్యంబునఁ గన్యకుల్ జనకునాజ్ఞన నాథువరించు టెందు న
ర్హం బటుగాన తండ్రికిఁ బ్రియం బెసలారఁగఁ జెప్పివచ్చెదన్.

క. ఏ మరిగి వచ్చుదాఁకను
నేమంబున నిచట నుండు నిశ్చలమతివై
యీమేడమీఁదినెలవుల*
కై మఱచియుఁ బోకు మనుచు నరిగెఁ జెలులతోన్.

వ. ఇంతి యరిగినయనంతరంబ ౧౩౦

క. ఈమీఁదినెలవు చూడకు
మీ మఱచియు ననుచుఁ జెప్పి మెలఁతుక చనె నం
దే మేమి యుండునో యని
యామీఁదటినెలవు కేగి యాసీమమునన్. ౧౩౧

క. వరరత్నమయమునుం గడుఁ
గర మొప్పెడునఱలు మూఁడు గని యం దొకమం
దిరము కవాటంబు దెఱచి
పరికింపఁగ లోన నొక్కపర్యంకమునన్. ౧౩౨

---

*నిలువుల- అని కలదు.

వ. ముసుం గిడినరూపంబుఁ గనుంగొని తదావరణంబు దొలఁ
గించిన. ౧౩౩

సీ. గవిసన వుచ్చిన నవకాంతి నొప్పారు
వలరాజుకోదండవల్లి యనఁగఁ
చేటిక దెఱచిన బెడఁగు మీఱుచు నున్న
పూవిల్తురత్నంపుబొమ్మ యనఁగ
నొఱ వాప నందంద మెఱుఁగులు చల్లెడు
పుష్పబాణునిఖడ్గపుత్రి యనఁగ
నలుక నిడ్డముసుంగు దొలఁగఁబుచ్చిన నొప్పు
భావజుపట్టపుదేవి* యనఁగ
మెఱసి వెడలంగ వెలుఁ గొందు మెఱుపు వోలె
ముసుఁగు వుచ్చినఁ దనుదీప్తి ముసుఁగువడఁగఁ
జూడఁ గన్నులపండు వై సొబగు మిగులు
కామినీమణిరూపంబు గాన నయ్యె. ౧౩౪

క. ఆరూపు చూచి మదనవి
కారము మదిఁ దనర నిద్రగదిరినయది యి
న్నారీమణి నిద్ర దెలిపి
యారయఁగ సుఖాబ్ధి నోలలాడెద ననుచున్. ౧౩౫

గీ. తెలిపి తెలిపి యెట్లుఁ దెలియకయుండిన
నిద్ర గాదు దీర్ఘనిద్ర యనుచు
నట్టు నిట్టు నిట్టియసమానవిలసనం
బేల గలుగు ననుచుఁ జాల బ్రమసి. ౧౩౬

---

* పట్టపదేవి– మా.

వ. కొంతతడవునకు డెందంబునం దెలివి నొంది యూర్పు లరసి
సజీవం బని నిశ్చయించి యాశ్చర్యంబు నొంది. ౧౩౭

క. చైతన్యము లే కుండియు
నితరముం జెన్ను గలిగె నింతితనువునం
జైతన్యము గలిగిన నీ
నాతిచెలువు వొగడ వశమె నలువకు నైనన్. ౧౩౮

వ. అని యెప్పటియట్ల చేల గప్పి తొలఁగి వచ్చి యాసంగడి
నున్నమందిరంబుఁ బ్రవేశించి ముందటిచందంబు రూపు గ
నుంగొని మునుంగు వుచ్చిన. ౧౩౯

క. చంచత్ప్రభఁ గనుపట్టె ను
దంచితకాంతిని సముజ్జ్వలాకృతితోడన్
సంచారఖేదమున ని
ద్రించినశారదశశాంకరేఖయుఁ బోలెన్. ౧౪౦

క. తొంగలిఱెప్పలమెఱుఁగులు
తొంగలిగొనుమేను వదనతోయరుహంబున్
శృంగారనిద్రఁ గూరె ల
తాంగి యనుచుఁ దలఁచి చాల ననురక్తిమెయిన్. ౧౪౧

వ. తెలిపి యెట్లునుం దెలియకున్న మున్నింటియింతిచందం బ
గుట యెఱింగి నివ్వెఱఁ గందుచు. ౧౪౨

క. అత్తరుణి రూపురేఖయుఁ
జిత్తమునకుఁ జాల వేడ్క సేయఁగఁదొడఁగెం
జిత్తరువుచందముననుం
బుత్తడిరూపుగతి రత్నపుత్రికపోల్కిన్. ౧౪౩

వ. అని యచ్చెలువచెలువు వొగడించి. ౧౪౪

క. ఆవసితకు ముసుఁ గిడి చని
యావలిమందిరముఁ జొచ్చి యందును నొకవ
స్త్రావృతరూపము పొడగని
యావరణము పుచ్చి చూడ నాశ్చర్యముగన్. ౧౮౫

వ. పరోపకారిభూపాలనందనరూపం బగుట యు నాపోవక కనుం
గొని విస్మయంబుఁ బొంది యరసి మున్న పొడగన్న య
న్నాతులయట్ల యగుటం దెలిసి యుల్లంబు జల్లన మూర్ఛిల్లి
యెంతయుం దషవునకుం గొంత తెలివిం బొంది. ౧౮౬

శా. ఈవామాక్షి సముద్రముం గడచి యెల్లే తెంచెనో వచ్చెఁ
బో, చావంగాఁ గత మేమి ఖేచరజనస్థానఁబునఁ దీనికై
చావు నోవును నొందుపాటువడి బల్పందఁబుబం జేరితిఁ
దైవంబా యిటు లేలచేసితివి తంత్రంబో మరుంజంత్రమో.*

వ. అని దైవంబు దూఱి యవ్వామనయన నుద్దేశించి. ౧౮౮

సీ. తరుణి నీకుచపర్వతము లెక్కఁగాఁ గోరి
దారుణోన్నతపర్వతంబు లెక్కి
మగువ నీముఖచంద్రమండలాకృతిఁ జూడఁ
దమకించి బహుమండలములు చూచి
యంగన నిన్ను రాగాబ్ధి ముంపఁ దలంచి
యతిదుష్కరం బైనయబ్ధి మునిఁగి
జలజాక్షి నినుఁ జూపువలఁ దగుల్పఁగఁ బూని
పలుపాటు లను విధివలలఁ దగిలి
కనకపురము గాంచి కడుఁ బ్రమోదము నొంది
నిన్నుఁ జూతు ననుచు నున్నచోట

* చేసితివి వితంత్రంబొ మరుజ్జంత్రమో - మూ.

నేల వచ్చి తిచట కేల యీదశ నొంది
తేల నన్ను నొంచె దిందువదన. ౧౪౯

వ. అని విలాపించుచు మదనతాపంబువం గాఁచుకొనలేక సౌధో
పరిభాగంబునం జరియించుచున్నంత. ౧౫౦

క. క్షితినాథ మాయతురగం
బతిరయమున మేడమీఁది కరుదెంచి సము
న్నతఖురమునఁ జిమ్మిన న
ద్భుతముగ నావర్ధమానపురమునఁ బడితిన్. ౧౫౧

క. పడి మూర్ఛ నొంది యెంతయుఁ
దడవునకుం దెలివి నొంది తత్పుర మగుచే
ర్పడ నెఱిఁగి నాదుపాటులు
గడువ మ్మొగుటకును వగవఁగా నవ్వేళన్. ౧౫౨

క. కనకపురిఁ గనినవారికిఁ
దనపుత్త్రికఁ గనకరేఖఁ దగుధనములతోఁ
మనుజేంద్రుఁ డొసంగెడు నని
జను లెఱుఁగఁగ నగరవీథిఁ జాటం గంటిన్. ౧౫౩

క. ఆచాటు విని కనకపురి
చూచినరూపంబు రాజసుతగా దనుచు
న్నాచిత్తము కలఁక యుడుగ
వేచని తొంటిగతిఁ బతికి వినిపించుటయున్. ౧౫౪

క. ఆనరపతిపుత్త్రికయునుఁ
దానును నొక్కెడన యుండి తగఁ బిలిపింపం
గా నరిగినననుఁ గనుఁగొని
యానెలఁతుక తొంటిధూర్త యని పలుకుటయున్. ౧౫౫

సీ. నాఁ డెఱుంగను గాని నేఁ డెఱింగితిఁ జెలి
యత్యగమ్యంబై నయప్పురమున
కరిగి చంద్రప్రభ యనుకాంతఁ బొడగంటి
నది తనసోదరు లైనసతులు
మునిశాపమున మర్త్యమును బొందిరని చెప్పి
నను వరించెద నని జనకుకడకు
నరిగిన నేను సౌధాగ్రంబునకు నేగి
మూఁడుతల్పంబుల మూఁడుయువతి
రూపములఁ గంటి నం దొక్కరూపు నీదు
రూప మై యున్న వెఱఁగంద నేవు మిగిలి
తురగ మొక్కటి నినుఁ జేరఁ గొనిజఁ జిమ్మఁ
బడితి నిప్పురిలోపలఁ బద్మనయన. ౧౫౬

వ. అనినమాటలు విని యాతణంబ యమ్మానిని విగతజీవ
యైన నాశ్చర్యంబునొంది యంతస తెలి వొంది యాకనక
పురిసౌధాగ్రంబునం గనినమానినీరూపంబులు మూఁడును
దత్సోదరుల నైజరూపంబులు గానోపు నందు మూఁడవ
రూపం బీయింతిది, దీనిజీవం బచ్చటి కరిగినది నాకు నిచ్చటం
దడయం బని లే దన్నలువురఁ వరియింపక కమలాకరమహీ
వరదర్శనంబును సమకూరదు గాన మున్ను చనినమార్గంబు
నం జనియెదం దత్తరుణీవరణంబు దైవనిర్మితం బగుట నాకు
నవశ్యంబును హేమపురదర్శనంబు సిద్ధించు ననుచు నిశ్చయిం
చి వెడలి మున్ను చనినసముద్రతీరంబున కరిగి యచ్చట.

క. జలనిధిలోపల నాఁ డట
కల మవిసిన బ్రదికి వచ్చి కడఁ జేరిన యా

చెలికాని వైశ్యునిం గని
యలరుచు నాక్రమముఁ జెప్ప నాతఁడు ప్రీతిన్. ౧౫౯

ఉ. సన్నొకయోడఁ బెట్టి జతనంబుగ వారిధిలోనఁ బంచినన్
మున్నిటి దాశనాథునితనూభవు లున్నెడ కేగి యేను మున్
జన్నవిధంబుఁ దజ్జనకుచన్న తెఱంగును జెప్ప నయ్య నీ
వన్నవధించి వచ్చి తని పల్కుచు నెంతయుఁ బాపబుద్ధు లై.

క. చండికి బలిసేయుద మని
చండతఁ బాదములఁ బెద్దసంకెల యిడినన్
బెండువడి వారిగృహమున
నుండఁగ నవ్వేళ దైవయోగము కతనన్. ౧౬౦

ఉ. అన్నవకాను మించుదొలఁకాడెడుమేను వల్దచన్నులుం
జెన్నమొగంబునుం గురులుఁ జిత్తజుతూపులఁ బోలుచూపు
లుణ్, నన్నలరింప నిందుమతినాఁ జను దాశనరేంద్రుపుత్రి
నా, యున్ననికేతనంబునకు నొక్కతెయుం జనుదెంచి వే
డుకన్. ౧౬౧

చ. జలజదళంబులం జఱచి చంద్రమరీచుల గేలిసేయుచుం,
గలువలయొప్పులం దెగడి కారుమెఱుంగుల మించి కామున
మ్ములచెలువంబు గీడ్పఱిచి ముత్తెపుజల్లులఁ బోలఁ జాలు
చూ, పుల ననుఁ గప్పి నామది నపూర్వకుతూహల మావ
హిల్లఁగన్. ౧౬౨

గీ. దాశరాజపుత్రి ౙుద్దయు వేడ్కతోఁ
జెలువ మడరుచూపువలలు విచ్చి
యువ్వి(గ)బ్బులగుట నపుడ నాకన్నులం
గలుగఁ జేసెఁ దనదుకులవిధంబు. ౧౬౩

వ. అట్లు నన్నుం దగులించి తనమనంబున మిగులఁ దిగు లొంది.

క. పర్వినకూరిమిఁ జనవున
గర్వంబున నపుడ నానిగళ మూడ్చి గృహం
తర్వర్తు లెఱుంగఁగ గాం
ధర్వవివాహమున నన్నుఁ దగవరియించెన్. ౧౬౫

శా. ఆలీలావతితోడిలీలలఁ బ్రియం బారంగ నం దుండఁగా
బాలేందుం గలయంధకారముగతిం బ్రద్యోతిదంష్ట్రాకిన
తోక్రోలం బొక్కటి వచ్చి తత్పురమునం గోలాహలోదగ్రతం
గ్రాలంగాఁ గని విల్లు గైకొని భుజాగర్వం బఖర్వంబుగన్.

చ. చని కూడముట్టి యుజ్జ్వల
ఘనశరమున నెఱను నొవ్వఁగా నేయుటయుం
దను కొంది పంది యతలం
బున గొందికి నరిగె నొక్కభూవివరమునన్. ౧౬౭

క. వెంటనె యతలమునకుఁ జని
యుంటఁ దఱిమి జమునిపాలి కనిచి యచట నేఁ
గంటిఁ గొలనిదరి వాలుం
గంటి నొకతె నొంటి మెలఁగఁగా నచ్చోటన్. ౧౬౮

ఉ. అన్నగుమోమునుం జిగియు నాతెలిగన్నులక్రొమ్మెఱుంగు
లా, పెన్నఱివేణినీలరుచిపెంపును నాబిగిచన్నుదోయియ
త్యున్నతిసొంపు నామృదుతనూజ్జ్వలకాంతియుఁ గాంతలందు
ము, న్నెన్నఁడుఁ జూడ నేను జరియించినభూములలోన
భూవరా. ౧౬౯

వ. అమ్మోహనాకారం జేరం జనుటయు నది యి ట్లనియె.

క. ధరణీశ్వరనందన నే
సురరిపుచేఁ బడితి వాఁడు సూకర మై నీ
శరమున నిహతిం బొందెను
వరియింపుము నన్ను ననిన వారనివేశ్మన్. ౧౭౧

క. అనుపమ మగునాతొయ్యలి
మనసిజభోగములఁ దేల్చి మచ్చికతో నిం
పెనయఁగ నావృత్తాంతము
వినిపించుట యుం బ్రమోదవికసితముఖ యై. ౧౭౨

సీ. కనకరేఖయు దాశకన్యయు నేను జం
ద్రప్రభారమణి సోదరుల మేము
మునిశాపవశమున మువ్వురమును మర్త్య
జనిఁ బొందినారము కనకపురముఁ
జూచినమనుజునిం జూచినఁ గనకరే
ఖకుఁ దొంటి శాపమోక్షంబు గలుగు
వానిఁబొందఁగ దాశవరతనూజకు నాకు
మనుజజన్మము మానుననియుఁ గలదు
కనకరేఖయుఁ దనమూర్తి గలసె నిన్నుఁ
బొందెఁగావున నటుచను నిందుమతియు*
నేనునరిగెద మాతొంటిమేని కేము
పొందఁగలమింక నిను హేమపురము నందు. ౧౭౩

క. ఏ నీమేను దొఱఁగిచనఁ
గా నీవును వీక వెడలు గహ్వర మాలో

* ఇందుమతి బిందుమతి యను రెండురూపములుం గలవు.

నానిజదేహము నొంది వి
మానముఁ బుత్తెర రమ్ము మాపురమునకున్. ౧౭౪

వ. అని పలికి యాక్షణంబ మే ననలజ్వాలలం దొఱంగి యరు
గుటయును నావచ్చిన మార్గంబున వెలువడి విమానంబున
కెదురుచూచుచున్నంత. ౧౭౫

క. రాజితమణిఘృణు లెసఁగ
న్రాజమరాళములు పూనిన విమానంబుం
దేజోనిధి యొకఁడు ఖచర
రాజాజ్ఞం దెచ్చుటయును బ్రమదం బెసఁగన్. ౧౭౬

క. ఆవరయానము నెక్కి న
భోవీథిని వేఁకఁ గనకపురమున కరుగం
గా వీరచూడుఁడు బహుసం
భావనము లొనర్చి యపుడు భావం బలరన్. ౧౭౭

క. శ్రీ నెఱయఁగఁ దనకన్యల
నానలువుర నొలిఁ బరిణయము చేసి లస
చ్చీనాంబరమణిభూషణ
నానావిధవంక్తు లిచ్చినం బ్రమదమునన్. ౧౭౮

వ. ఆలీలావతులతోడ యభీష్టలీలల విహరించి మిమ్ముఁ గాంచు
తెఱం గూహించి. ౧౭౯

ఉ. మానినుల న్వరించి మఱి మానవనాథునిఁ గాంచె దంచు
నా, కానతి యిచ్చె వాని తదయం బనిలేదు విమాన మె
క్కి యం,భోనిధిమీఁదుగా నరిగి భూస్థలి చూడఁగ నవ్వి
ధంబునం, గానఁగ నయ్యె నం చరసి గ్రక్కున నేగద నక
దలంపునన్. ౧౮౦

వ. వచ్చి వచ్చి యిచ్చట దేవరం గాంచి కృతార్థులమైతి మని నన నందఱుం బ్రమోదభరితులై రి తదనంతరంబ. ౧౮౧

ఉ. భట్టియుగంధరాదినరపాలకమంత్రిమహాప్రవాహసం
ఘట్టనధీధురంధర వికారవిదూరవిలాసబంధురా
పట్టపటావళీకనకభద్రమదావళభూరిభూషణా
రట్టజవాజిరత్ననికరక్రమపూజితకాలకంధరా. ౧౮౨

క. శారదనీరదనారద
పారదబిసశారదాబ్దభాస్వరితయశః
పూరఘనసారపూరిత
సారసగర్భాండభాండ సదవనశౌండా. ౧౮౩

మందారదామము. సంగీతసాహిత్యసారస్యలోలా
శృంగారలక్ష్మీవశీకారలీలా
అంగాధిపౌదార్యహారిప్రదానా
అంగీకృతశ్రీమదాదిప్రధానా. ౧౮౪

గద్యము. ఇది శ్రీమద్వెన్నెలకంటి సూరనామాత్యపుత్ర హరితసగోత్ర పవిత్ర సుకవిజనమైత్రీ విధేయ అన్నయనామధేయప్రణీతం బైన షోడశకుమారచరిత్రంబు నందు షష్ఠాశ్వాసము.

---

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము.

## సప్తమాశ్వాసము.

క. శ్రీభార్గవకామందక
వైభావసవోపధార్యవాసవమంత్రి
ప్రాభవవిడంబధీగుణ
శోభితషాడ్గుణ్య యన్నసూరవరేణ్యా. ౧

చ. ఎదురుగ వచ్చి కాంచు ధరణీశుల రాజ్యము లిచ్చి నిల్పుచు
న్మదమున మాఱుకొన్న నృపమండలి నింద్రునివీటి కంచుచుం
బదవులు మార్చి దుర్నృపుల బంధనశాలలఁ బెట్టఁ బంచుచు
న్విదితబలాఢ్యుఁ డానృపుఁడు విశ్రుతలీలల పాలుచున్నెడన్.

గీ. పుత్రవర్ధన మనియెడు పురము రాజు
గాన రాఁడు దేవర నతిగర్వి యనుచుఁ
జారు లెఱిఁగింప నధికరోషమునఁ గదలి
వీఁక జని యప్పురముమీఁద విడియుటయును. ౩

క. అరదంబు లెక్కి యిద్దఱుఁ
బురము వెడలి వీఁక వచ్చి భూమి యద్రువ ను
ద్ధురగతి నార్చుచు బలములఁ
బోరిగొనఁ దొడఁగుట యు విని విభుం డలుకమెయిన్. ౪

వ. అయ్యురువురం బరాజితులం జేసి పట్టితెం డని చండబలు ల
గుతసమంత్రులం బంచినం బని పూని వారు సన్నద్ధు లై
తేరులు దోలుకొని యాశూరులం జేర నరిగి చూచి య
య్యురువురును దమదృఢముష్టి యు దీర్ఘబాహుండు ను నై
నం బరమానందంబు నొందునంత నాభీమభటాదులుం గని
యుల్లంబున నల్లసిల్లి. ౫

—♦ దృఢముష్టిదీర్ఘబాహులకథ ♦—

క. వా రిరువురు సంభ్రమమునఁ
దేరులు డిగఁగా రథావతీర్ణు లయిన వే
వా రందఱు నమ్మంత్రులుఁ
జేరియుఁ బరిరంభణంబు చేసి ముదమునన్. ౬

వ. భూపాలుపాలికిం గొని చనిన నవ్విభుండు దవ్వులనే యామం
త్రులం గని యామోదంబున నెదురు చని తత్ప్రణామంబు
లాదరించి యెత్తి యిరువుర నొక్కకౌఁగిటం జేర్చి గౌరవిం
చి యుచితాసనంబుల నుండ నియోగించి సింహాసనాసీనుం
డై తదీయవదనంబులం జూడ్కి నిలిపి మీ రెచ్చటం జరి
యించి యివ్విధంబున కరుగుదెంచితి రని యడిగిన దీర్ఘబా
హుండు కరకమలంబులు మొగిడ్చి. ౭

గీ. వింధ్యమున నేను మి మ్మాటు వెదకఁ బూని
పెక్కుభూములఁ జరియించి యొక్కనాఁడు
వరవిభవరమ్య మైనట్టిపురముఁ జొచ్చి
యం దొకమహీసురునియింటి కరుగుటయును. ౮

వ. ఆయింటి ముదుసలి శోకవ్యాకుల యై యుండి నన్ను నాలో
కించి. ౯

శా. ఓయన్నా! జమువీటికిం బయనమై యున్నాఁడు నాపట్టి
నా, కాయం బుద్ధురవేదన న్నిలువ దింక న్నాధనం బేల (పో
వే యంచుఁ) నెలుఁగెత్తి యేడ్చుటయు నిర్వేదంబునం
బొంది యే, నాయంబం గృపఁ జెంది కన్నుఁగవనీ రందంద
చే నొత్తుచున్. ౧౦

వ. తత్పుత్రమరణోద్యోగంబునకుం గారణం బేమి యని య
డిగిన. ౧౧

సీ. ఈవీటిరాజగు దేవసేనతనూజ
దుష్టలబ్ధాఖ్య యద్భుతవిలాస
సంపూర్ణయౌవనోజ్జ్వల పురిఁ గలయట్టి
కొమరుల నిచ్చ యొక్కరునిగాఁగ
బలిమిమై నయ్యింతి పిలిపించికొను నందుఁ
బోయినవా రెల్లఁ బొలిసిపోవ
నింతకుమున్న యనేకులు చనిరి నా
వరతనూజాతునివరుస నేఁడు
దీని వల దని మాన్పంగ దిక్కు లేదు
నింతతోడ మాసంసార మెల్లఁ దీఱె
ననుచుఁ గ్రమ్మఱ నెలుఁగెత్తి యడలుటయును
నభయహస్తంబు నిచ్చి యి ట్లంటి నేను. ౧౨

క. నీకొడుకుఁ గాచి యీరే
యాకన్నియపాలి కేన యరిగెద నింకన్
శోకంబు మాని నెమ్మన
నాకులగతి నుండవమ్మ యని పలుకుటయున్. ౧౩

క. ఓహో యిట్లనఁ దగునే
దేహము వడ నడుగు సుతుఁడు దీఱినవగ ము
న్మోహమున నిన్నుఁ బంచిన
యాహత్య దొరంగు నయ్య యన్నిభవములన్. ౧౪

ఉ. ఎవ్వరి నేమి చేసితినొ యేఁ దొలుబామున నాకుమారకుం
డివ్విధిఁ బోయెడుం గొడుక యీజననంబున నింక నేరికిన్
నొవ్వి యొనర్ప నోడుదుఁ దనూజుని కై నిను సద్గుణాఢ్యు
నే, నెవ్విధిఁ జావఁ బంతు ధన మిచ్చెదఁ గైకొను మన్న
నావుడున్. ౧౫

క. లావును వెరవును గలుగుదు
నే విజయుఁడ నెల్లకడ నరేంద్రతనయచేఁ
జావక జయింపనోపుదు
నావాక్యము నెమ్మనమున నమ్ముము జననీ. ౧౬

వ. అని యూఱడం బలికి నాఁటి నిశాసమయంబున రాజకన్య
కాసదనంబున కరిగి రత్నదీపప్రభాశోభితం బైన తదంతరం
బున నాకాంత హంసతూలికాతల్పంబున నున్నంత. ౧౭

క. తొలుకారుమెఱుఁగు కై వడిఁ
బులుకడిగిన మరునిశరము పోలికి నత్యు
జ్జ్వలరత్నపుత్రికాకృతిఁ
బొలఁతుక చనుదెంచె నెరసు పొంపిరివోవన్. ౧౮

వ. అయ్యింతితోడన ఘోరాకారుం డగు నొక్కరక్కసుం డ
రుగుదెంచె నయ్యవసరంబున. ౧౯

చ. జలదము పొంతఁ గ్రొమ్మెఱుఁగుచాడ్పున శైలముఁ జేరియు
న్న పుష్పలతికభంగి రాహుకడఁ జంద్రసముజ్జ్వల లక్ష్మి

పోల్కి న,య్యలఘునిశాటుఁ బ్రేమాలఁ జెలువారెడు నాసతిఁ
జూచి వానిదో,ర్బల మొకచీరికిం గొనక రాగముఁ గౌతుక
ముం దలిర్పఁగన్. ౨౦

క. తప్పక చూచుచు నుండఁగ
నప్పొలఁతియు నన్నుఁ గాంచి యనురాగముతో
జెప్పయిడక కనుఁగొనఁగా
నప్పుడు నామీఁదఁ గడఁగె నసుర యలుకమై. ౨౧

క. సురవైరిఁ జూచి యేనును
గర మలుకఁ గరాసి వెఱికి కమలాకరభూ
వరుజంట దీర్ఘబాహుండ
నురుతరముగ నన్నుఁ జూచె దోరనిశాటా. ౨౨

గీ. అనిన దైత్యుండు తనయాగ్రహంబు విడిచి
యీవు కమలాకరుని బంటవేని నేను
నీదుకూరిమిచెలిమామ నిన్ను వెదుక
నరుగుదెంచితి ననిఁ బ్రియంబునొంది. ౨౩

క. ఏమిత్రుమామ ననుటయు
ధీమహితుం డైనయట్టి దృఢముష్టికి నే
మామ నని చెప్పుటయు నే
నామోదతరంగితాంతరంగుఁడ నగుచున్. ౨౪

వ. అతం డేమికతంబున నీకు నల్లుం డయ్యె నిప్పు డెచ్చట నున్న
వాఁడు చెప్పవయ్య యని యడిగినఁ దద్వృత్తాంతం బతని
చేత నేవిన్నదియు నేనుం గన్నదియును వివరించెద నాక
ర్ణింపుము. ౨౫

క. వంధ్యోద్యమఖిన్నతమై
వింధ్యాటవి నతఁడు మిమ్ము వెదకి తిరుగుచున్
సంధ్యాసమయంబునఁ ద
ద్వింధ్యనిలయగృహము చేరి విధి కడలుతఱిన్. ౨౬.

వ. విస్తారోదారం బైన యయ్యగారంబున నొక్కదిక్కున నర్ధ
రాత్రసమయంబున. ౨౭

క. సాధకుఁ డొకరుం డొక బిం
బాధరఁ గొనివచ్చి యేమి యర్థించిరొ య
మ్మాధవికి బలియొనర్చుట
కై ధృతిలే కడలఁ బట్టి కట్టి తెగువ మై. ౨౮

క. కరవాల మెత్తుటయు మదిఁ
గరుణ వొడమ దానిఁ జూచి గ్రక్కున శౌర్యో
ద్ధురుఁడై బలువిడి నాతని
శిరము దునిమి దేవికి బలి చేసి వినతుఁడై. ౨౯

క. ఆవనితకట్టు లూడిచి
భావము వెఱ వాయఁ బలికి పద్మనయన నీ
వేవానిసుతవు నిను వీఁ
డేవిధమునఁ దెచ్చె నాకు నెఱిఁగింపు మనన్. 30

వ. భయసంభ్రమంబులు మనంబున ముప్పిరిగొన నప్పయోరు
హాలోచన నేను మాణిక్యపురాధీశ్వరుం డైన రత్నకేతుని
తనూభవను రత్నప్రభ యనుదానను నేఁటి సంధ్యాసమ
యంబున మహోత్సేధం బగు సౌధాగ్రతలంబున నిద్రింప
నిద్దురాత్ముండు నన్ను నెత్తికొనితెచ్చి యిచ్చట నిట్లొనర్ప
నిడికొని యున్నవాఁ డింతలో నీవు నాపాలిభాగ్యదేవతవు

వోలె వచ్చి నాప్రాణంబులు గాచితివి, నీయధీనంబ నైతి నీచిత్తంబుకొలందిఁ నడవంగలదాన నని విన్నవించిన నతండు.

క. నిను దోడుకొనుచుఁ జని నీ
జనకున కొప్పించి యిచ్చెఁ జనియెద నని య
వ్వనజాయతలోచనఁ దో
డ్కొని తెలతెల వేగునంతకును బురి కరిగెన్.   ౩౨

వ. అరిగి రాజమందిరద్వారంబున నిలిచి యాకాంత నంతఃపురంబులోపలికిం బనిచిన శోకవేగంబున బలవించుచున్న త జ్జననీజనకులపాలికిం జని తన వృత్తాంతం బంతయు నెఱింగించిన సంభ్రమించి.   ౩౩

క. మనమున నత్యద్భుతమును
ఘనమోదము నుల్లసిల్లఁగా నప్పుడ యా
తని దోడితెచ్చి గౌరవ
మెనయఁగ నర్ఘాసనమున నిడికొని ప్రీతిన్.   ౩౪

వ. తద్వృత్తాంతం బడిగి యతండు చెప్ప నంత యు నాకర్ణించి కులపౌరుషంబుల నధికుంగా నెఱింగి యుల్లంబున నుల్లసిల్లి.

గీ. ప్రాణదానం బొనంగితి వట్లుగాన
నాసుతకు నీవ తగుప్రాణనాయకుండ
వఖిలగుణములయందు సత్త్వాధికుండ
వరుఁడు నీకంటెఁ గలఁడె యీవనజముఖికి.   ౩౬

వ. కావున నీరాజవదన వరియించి నారాజ్యలక్ష్మి కధ్యక్షుండవై యుండు మని యత్యంత ప్రియపూర్వకముగాఁ బ్రార్థించిన.   ౩౭

చ సమయము గాదు నా కిపుడు శాశ్వతభోగము లంద మా
మహీరమణుని మిత్రవర్గము ధరాస్థలి నారసి కాంచి పి
మ్మట, నముచితవృత్తి నీదువరనందనఁ బెండిలి యై యభీ
ష్టభోగముల సుఖింతు నే ననినఁ గ్రమ్మఱ నాతఁడు వల్కు
వేడుకన్. ౩౮

క. నానాదేశములకుఁ దగు
మానిసులం బనిచి సఖసమాజంబును మీ
మానవపతి నరయించెద
దీనత మైఁ గుంది నీకుఁ దిరుగఁగనేలా. ౩౯

వ. అని సమ్మతంబుగాఁ బలికి పలికినయట్ల వెరవరు లగు భృ
త్యుల నానాదేశంబులకుం నరయం బనిచి యొక్కశుభల
గ్నంబున నత్యంతవిభవంబునం దన కన్నియ వివాహం బొన
రించి సకలసంపదలు నిచ్చిన నచ్చెలువతో నభిమతక్రీడావి
నోదంబులం దేలుచుండి యొక్కనాఁటి నిశాసమయంబునం
దత్పురోపకంఠంబున నొక్క యార్తనాదంబు వీతెంచిన.

క. దృఢముష్టి వెడలె ఖడ్గము
దృఢముష్టి నమర్చి దాని తెఱఁ గెఱుఁగుటకై
దృఢముగ బలవితరణపరి
వృఢుఁ డార్తులఁ గావ నెట్టివేళలఁ గడఁగున్. ౪౦

వ. ఇట్లు వెడలి చని యయ్యార్తనాదంబు చక్కటికి నరుగు
నప్పుడు. ౪౧

క. అలఘుతరదివ్యభూషలు
వెలుఁగంగా నొత్తు హృదయవేదన దోఁపం

బలుమాఱును నెలుఁగడరఁగఁ
బలవించుచు నతనిఁ గని ప్రబలదైన్యమునన్. ౪౩

మ. నెఱిలే కోర్వనివారిమాటలకునై నేఁ డారెకు ల్మత్పతిం
గొఱఁతం బెట్టిరి దప్పిఁ దూలెడుఁ గడుం గొట్టుందనిం జా
లఁ దత్తఱముం బొందెద నీజలం బొసఁగు చందం బెద్ది
నాకంచుఁ బల్మాఱు దుఃఖించుచు వేఁడినం గరుణ యాత్మం
బర్వ ధైర్యంబునన్. ౪౪

గీ. నాభుజం బెక్కి నీప్రాణనాయకునకు
నీ రొసఁగు మంచు నాకొట్టుఁ జేర సరిగి
యాతఁ డెక్కించుకొన మొలపడర నెక్కి
మాఁపులందుఁ బదంబులు మోపి నిలిచి. ౪౫

గీ. కొఱతిపై నున్న చోరుని విఱిచినములఁ
బలలఖండంబు లిలమీఁదఁబడినఁ జూచి
పెలుక రక్కసిగా మదినెఱిఁగి యుచటఁ
గదలిపోవక నిశ్చల హృదయుఁ డగుచు. ౪౬

చ. సురుచిరదివ్యరత్నపరిశోభితనూపురరమ్యమైన త
చ్చరణము నంటఁబట్టుటయుఁ జయ్యనఁ దానది యూడిపో
వుడుం, గరములఁ దత్పదాంగదము గ్రక్కునఁ జిక్కినఁ జూ
చి మెచ్చులం, బొదయుచు వేడ్కఁ బట్టుకొని పోయి నరేం
ద్రతనూజ కిచ్చినన్. ౪౭

క. మనుజులకు బ్రాఁతియగు న
య్యనుపమ భూషణముఁ జూచి యయ్యింతి ప్రియం
బున దీనితోడియందియ
యును దొరకొనుభాగ్యమబ్బు నాకో నాకనినన్. ౪౮

వ. ఆతరుణీరత్నంబు కోరికి పారంబు నొందించుతలంపున నమ్మ
ఱునాఁటియర్ధరాత్రసమయంబున నీసఖుండు ఖడ్గైకసహాయుం
డై పరేతసదనంబున కరిగి తదంతరంబున నల్లనల్లన వసి
యించుచు. ౪౯

క. వినుతాహారంబులఁ గ్రొ
వ్వినయం గల మనుజమాంస మిదె యమ్మఁగ వ
చ్చినవాఁడఁ గోసి యిచ్చెదఁ
గొనవలసినవారు వచ్చి కొనరో యనినన్. ౫౦

క. అఁదియ గోల్పడిపోయిన
ముందటి దానవి సఖీసమూహముతో నిం
పొంద విని చేరఁగాఁ జని
మందరనగధీరు నాకొమరుఁ గని వేడ్కన్. ౫౧

వ. అన్నెలవునకు వినోదార్థంబు వచ్చి యొక్కయెడనున్న నాక
డకుం బఱతెంచి. ౫౨

క. మారాకారుఁడు మిక్కిలి
శూరుఁడు నగువాని కిత్తు సుత నం దెపుడున్
మారాకారుఁడు మిక్కిలి
శూరుఁడు నగువాఁడు గలిగెఁ జూపెద రమ్మా. ౫౩

వ. ఏను నిన్న నతనిపౌరుషం బంతయుం జూచితి నని తద్వృ
త్తాంతంబు వివరించి నేఁడును నన్ను బ్రమయించి పట్టి తో
డియుండియుం బుచ్చుకొని పోవు తలంపున వచ్చి తిరుగుచు
న్నవాఁ డని చెప్పిన నతనిం జేర నరిగి. ౫౪

శా. భూతప్రేతపిశాచరాక్షసగణస్తూ త్రైక జనప్రేక్షకా
భీతిం బర్వఁగఁ జేయు నిన్నెలవున న్భీమాంధకారంబున

స్వీతాతంకత నీవు ద్రిమ్మరుటకున్ డెందంబున న్మెచ్చి సం
ప్రీతిం బొందితి వేఁడు మివ్వాఁడు మనోభీష్టంబుల న్నానృపున్.

గీ. నిన్ననొకయెండ చేకుఱె నిన్నెలవున
నాకు నీతోడియందియుకై కడంగి
యరుగుదెంచితి నిచటి కయ్యెండె నాకు
నిచ్చుట యభీష్ట మనవుఁడు నిచ్చ నలరి. ౫౬

క. వెనుకదెస నున్న దానవిఁ
గనుఁగొనుటయు నందెవుచ్చి క్రమ్మఱ నాకి
చ్చిన నేనాతనికిఁ బ్రియం
బెనయంగా నిచ్చి మైత్రి యెసకంబెసఁగన్. ౫౭

వ. ఏ నడుగం దన బాల్యంబు మొదలుకొని నిన్నుఁ గన్నదితుది
గా నిజవృత్తాంతం బంతయు నెఱింగించిన నీచెలిమాటలకు
మోదించి మమ్ముఁ జూచి యరుగుదు గాని ర మ్మని మ
త్పురంబునకుం దోడ్కొనిపోయి మదీయంబు లగుసకల సం
పద్విభవంబులుం జూపి వివిధసంభావనంబు లొనరించి.

చ. అవిరళకాంతికాంతనవయౌవనరూపవిలాసభాసురన్
యువతిలలామ నాతనయ నుత్సవమారఁగఁ బెండ్లి చేసిన
న్భువనమనోజ్ఞభోగములఁ బొందుచుఁ గొన్నిదినంబు లుండి
భూధవసుతపాలి కేగి ప్రమదంబున నందియ యిచ్చి మ
చ్చికన్. ౫౮

వ. అచ్చట నచ్చపలనయన నిష్టోపభోగంబులం దేల్చి క్రమ్మఱ
మత్పురంబున కరుదెంచి మిమ్ముం బొడగను నుపాయంబు
చింతింపుచుండ నొక్కనాఁడు శుక్రశిష్యుండు మహామతి య
నవిప్రుండు మాసదనంబున కరుగుదెంచిన నితండు త్రికాల

వేడి యని యేనుం జెప్ప నీసఖుఁ డెఱింగి యతనికిం బ్రణ
మిల్లి మీ తెఱం గడిగిన నామహానుభావుండు నావదనం బవ
లోకించి. ౬౦

సీ. పుత్రవర్ధననామపురము నేలెడురాజు
తనకూఁతుఁ బరదేశమునకు నొసఁగఁ
జాలక యానతోజాతలోచనఁ జూచి
యిప్పురికొమరుల నెల్ల వరుస
నీకడ కరుదేర నియమంబు చేసెద
నందులో నీమెచ్చునట్టివాని
హృదయేశుఁగా వరియింపుము నీ వని
నేఁడు చెప్పినవాఁడ నీ వచటికిఁ
దీవ్రగతి నేగి దాని కదృశ్యుఁడ వయి
రాత్రు లరుదెంచి తత్కుమారకుల నోలి
ననుదినంబు నాహారంబు గొనుచు నుండు
మతనిచెలి యొకఁ డొక్కనాఁ డరుగుదెంచు. ౬౧

వ. ఆతండు కేవలపురుషుండు గాఁడు గావున నీభావంబుం గనుం
గొని పేరువాఁడి నీమీఁదం గవియునప్పుడు నీవృత్తాంతంబుఁ
జెప్పి యిరువురం గూర్పుము నీవు గూర్చినవెనుకఁ గతిపయ
దినంబుల వీరుం దమరాజును జెలులం గలసెద రని పలికి ని
జేచ్ఛ నరిగె నతనివచనప్రకారంబున నిన్నుం బొడగాంచి
కృతార్థుండ నైతి నల్లి నీసచ్చెలి నిచ్చటికిం దోకొని వచ్చె
ద ననినం బరమానందభరితమానసుండ నై యాదనుజపుం
గవుం గవుంగిలించుకొని యతిరయంబునం దోడ్కొని ర
మ్మని పనిచిన నతండును నతిత్వరితగతిం జని తద్వృత్తాం

తం బంతయు దృఢముష్టికిం జెప్పిన నద్భుతప్రమోదరసాయ త్తచిత్తుం డై నీకతంబున నాసెచ్చెలివృత్తాంతం బంతయు నెఱింగితి నని యతని వినుతించి వివిధవస్తువాహనంబులతో నారక్కసుండు దోడ్కొనిపోవఁ బత్నీసమేతుఁ డై పుత్రవర్ధననామనగరంబునకు వచ్చి సన్మునిం గాంచి యన్యోన్యస్నేహపూర్వకంబుగా నాలింగనకుశలప్రశ్నాదివిధానంబు లొనరించి దాని వరించి యభిమతక్రీడావినోదంబులసుఖం బనుభవించుచుఁ గొన్నినాళ్లుండునంత. ౬౨

క. పుత్రకులు లేమి నపు డా
ధాత్రీపతి రాజ్యభరముఁ దమయుం దిడి స
న్మైత్రి దగ నునిచి పరమప
విత్రత వని కరిగి నియమవిధి వర్తిల్లెన్. ౬౩

వ. మేమును భవద్దర్శనంబు గోరుచు నిందుండ మాభాగ్యవశంబున దేవరం బొడగని కృతార్థుల మైతి మని విన్నవించుటయు నమ్మహీవల్లభుండు సంతసిల్లి వారల నుచితప్రకారంబున సంభావించి హంసావళియందలి యనురాగంబునకు ననుగుణోద్యోగంబుగా దిగ్విజయయాత్ర నెపంబున విదిశాపురంబున కరిగి తత్పురోద్యానంబున వేత్రవతీతీరంబున విడిసి మేఘమాలమహీపాలునకుం దమరాక యెఱింగించి పుత్తెంచిన.

గీ. అత్తఱి సకలవస్తువితతులు కానుకగాఁ
గొనుచు నేగుదెంచి వినతు లగుచు
నానృపాలుఁ గాంచి యత్యంతబహుమాన
లీలఁ జెంది మైత్రి గీల్కొనంగ. ౬౪

వ. ఇష్టగోష్ఠీవినోదంబున నున్నయంత నమ్మహీకాంతునకు సం
తసం బొదవఁ దేజోవిభాకరుం డగు ప్రభాకరుం డి ట్లనియె.

క. నీతనయుండును సర్వశుభా
న్వీతనయ నొసంగవలయు నీ నృపతికి ను
ద్యోతితకౌతుక మొదవ మ
హీతలవర యనుఁడు నానరేశ్వరుఁ డంతన్. ౬౭

వ. సంతుష్టాంతరంగుం డై యెంతయుం దెలి వొంది వినయం
బునం గరకమలంబులు ముకుళించి యుచితప్రియపూర్వకం
బుగా నమ్మహీవల్లభున కి ట్లనియె. ౬౮

క. హంసావళిలో నెల్లను
హంసావళిఁ బోలు దిమ్మహాతేజమునన్
హంసావళికిని గవిజిత
హంసావళి కీవ తగినయధిపతి వధిపా. ౬౯

క. ఆకన్యారత్నంబును
నీకే తగు దిక్కులందు నిఖిలంబున సు
శ్లోకుండ వై వరింపు శు
భాకరలగ్నమున నవ్వరానన నెమ్మిన్. ౭౦

వ. అని పలుకుటయుం బుడమితేనికొలువున నున్న మహామా
త్రికు లెల్లింటినిశాసమయంబున విశేషలగ్నంబు గల దని వి
న్నవించుటయు నల్లసిల్లి మేఘమాలధరణీవల్లభుండు నత్తె
అతని కియ్యకొని సముచితప్రకారంబున వీడ్కొని యరిగి
యమ్మహోత్సవంబున కుత్సహించిన. ౭౧

క. తనారోపిత సత్కారలు
విని హంసావళి కరంబు వేడుక నేఁ గో

రినకమలాకరుఁడో య
జ్జనపతి వే ఱొకఁడో యనుచు సంశయ మడరన్. 22

వ. తనచెలి యగుకమలమంజరి కేకతంబున ని ట్లనియె. 23

క. మనభూపతి కమలాకరుఁ
డనునృపతికి నన్ను నిత్తు ననినాఁడఁట యా
తనియున్న వేలమునకుం
జని తద్విధ మెల్లఁ దెలిసి చనుదె మ్మనినన్. 24

సీ. తావులు వెదచల్లు పూవు లన్నియుఁ బుచ్చి
కచముల జడముడిగా నొనర్చి
కట్టిన వెలిపట్టుపుట్టంబు సడలించి
కరమొప్పు బ్రాఁతచెంగావి గట్టి
చందనమృగనాభిచర్చలు వోఁజేసి
మృదులనిర్మలభూతి మేన నలఁది
ధవళముక్తామయ తాటంకములు వుచ్చి
ప్రవిమలస్ఫటికము ల్చెవులఁ బూని
తొడవు లూడిచి రుద్రాక్షతొడువు వెట్టి
వరతపస్విని రమ్యభావంబుతోడ
నితరు లెవ్వరుఁ దా నని యెఱుఁగకుండ
నంబుజానన యన్నగరంబు వెడలె. 25

వ. వేత్రవతీతీరంబున నత్యంతవిస్తారోదారం బగు కమలాకర
స్కంధావారంబు దరియం జొచ్చి పేరోలగంబున సింహాస
నాసీనుండు ను సేవాగతానేకభూవల్లభకిరీటరత్నదీపికావిరా
జితపదారవిందుండు ను జామరగ్రాహిణీకరచామీకరచామ

రసాంచలనచలితకుంతలుండు ను న్నై యొప్పారు నమ్మహీవల్ల
భు నల్లనఁ జేరం జని. ౭౬

క. అగణితవిలాసుఁ డగు నా
జగతీపతిమూర్తి మానసంబున జూపుం
దగులంగ ననంత రాజ్యం
బగుఁగాక యటంచు భూతి యల్లన నొసఁగెన్. ౭౭

గీ. భూతి యిచ్చునపుడు భూపాలనందను
కరసరోరుహమునఁ గరము గదియ
నెఱకు లాడ నేసె మెఱుఁగుబాణంబులు
గ్రొత్తబత్తురాలిఁ గుసుమశరుఁడు. ౭౮

క. చెలువ యిటు పుష్పసాయక
దళితహృదయ యయ్యెఁ దనవిదగ్ధతకతనం
బులకలుఁ జెమరుం గంపము
వెలయఁగ నీదయ్యె నపుడు పెంపెసలారన్. ౭౯

వ. అవ్విభుం డాభూతిఁబుచ్చుకొని సముచితాసీనంగావించి యె
చ్చటినుండివచ్చితని యడిగిన నది క్రమ్మఱ దీవించి. ౮౦

క. ఏను బహుదేశచారిణి
నీనిఖిలముఁ దెలియ నాకు నిష్టం బగుటన్
శ్రీనిధి నిను దర్శింపం
గా నరుదెంచితి ననినను గౌతుక మెసఁగన్. ౮౧

క. అనవుడు నాదరమున నా
జననాయకచంద్రుఁ డుచితసత్కారము లిం
పొనర నిడి వీడుకొల్పిన
మనసిజదందహ్యమానమానస యగుచున్. ౮౨

వ. చనుదెంచునప్పుడు దన యంతరంగంబున. ౮౩

ఉ. ఈసరసోక్తి లీలమహిమ యీయవికారత యీవిలాస మీ
రాసిరి యీయుదారత ధరావరు లెవ్వరియందుఁ గల్గునే
యేసుకృతంబు చేసినమృగేక్షణ కబ్బెనొ భూతలంబుపై
నీసొబగుండు నాథుఁడుగ నింపులఁ దేలెడు నిత్యధన్యతల్.

వ. అని యభినందించి యొక్క కపటోపాయంబుఁ జింతించి హం
సావళీకన్యకు నతనిమీఁద నరుచిపుట్టునట్లుగాఁ బలికి మా
యోపాయంబున నవ్విభుని నేన వరియించెద రాత్రి లగ్నం
బగుట నా కవ్విధంబు సిద్ధించు నని నిశ్చయించి యబ్బాలి
కపాలికిం జని యేకతంబున ని ట్లనియె. ౮౫

క. కమలాక్షి భవన్మానస
కమలాకరమిత్రుఁ డైన కమలాకరభూ
రమణుండు గాఁడు దన్మా
మమువాఁ డీతండు రాజమర్కట మరయన్. ౮౬

గీ. వికృతవేషి మఱియు వృద్ధు క్రూరాత్ముండు
పాపకర్ముఁ డధికచాపలుండు
కుఱుచ తెవులుగొంటు పఱికగడ్డమువాఁడు
గదలఁ డేమిచెప్పఁ గమలవదన. ౮౭

క. కడవతల గొగ్గిపండ్లును
మిడిగ్రుడ్డులుఁ బల్లపల్లమోసంబులు దే
గడచెవులు గూనిమూఁపులు
బడగ బడుగు వానిఁ జెప్పఁ బనిలేదు చెలీ. ౮౮

శా. చెల్లంబో నిను వీని కీఁ దలఁచె లక్ష్మీహీని కొర్వంగ లే
కుల్లం బన్నరనాథచంద్రునకు రాఁడో కాక నే యట్టియు

త్ఫుల్లాంభోరుహనేత్రకు న్మగఁడె యీదుర్భావుఁ డేమందు
నో, తల్లీ యాతనిఁ జూచి గుండె వగిలెౘ దయ్యంబా యు
స్సీతిచేన్. ౮౯

క. తగుమగనికి నీనుచితము
దగుఁ దగఁ దనుమాత్రమైనఁ దగు నొసఁగంగా
మగఁ డ్రోఁతి యైనఁ దొడవగుఁ
దగునే తగుకన్య నొసఁగ ధరణీశునకున్. ౯౦

క. గారా మైనతనూభవ
నూరక యాచెడుగుముదుక కొసఁగెదు నని యీ
యూరెల్లను వెతఁ బొందెను
నీరాజున కేల బుద్ధి యిటు లయ్యెనొకో. ౯౧

గీ. ఏమి చేయుదాన నెక్కడఁ జొత్తు నే
నితనిఁబొందు నిన్ను నెట్లు చూతు
ననుచు మాయజంత యశ్రులు నించిన
నమ్మ సొమ్మవోయె నళినవదన. ౯౨

వ. ఇట్లు మూర్ఛ మునింగి హంసావళి యజ్జలభితన్నుఁ దెలుపఁ
దెలిసి యి ట్లనియె. ౯౩

ఉ. కామిని యట్టిరూపుఁ బొడగాంచినఁ బ్రాణము విడ్తు నప్డ
నా, కా మగఁ డేల యట్టి వికృతాకృతి కిచ్చెడు తండ్రి యే
ల నీ, వేమెయినైన రాత్రి నను నిచ్చటు వాపి మదీయవేష
మ్మున్, శ్రీమెయిఁ దాల్చి యాతని వరింపఁగదే యని యర్థి
వేఁడినన్. ౯౪

క. తనతలఁచినట్ల యగుటకు
నను మోదమ్మున్ బొంది ప్రమద వశాననవద్మం

బునఁ దోఁపఁగ నేటికి నిటు
నను వేఁడఁగ సీదుపను పౌనర్భవఁ జెలియా. ౯౫

క. కూరిమిచెలికిం దానొక
పోరామికిఁ గానిబోటి బోటియె నినః నీ
వారికిఁ దప్పించి తగ
నీ్నరూపముఁ దాల్చి యాశని వరింతు ధృతిన్. ౯౬

క. అనుటయును మాయ దెలియక
యనుకూలత గాఁ దలంచి హంసావళి చ
య్యనఁ దనచీరలుఁ దొడవులుఁ
దననెలవును దాని కిచ్చి తద్దయు భీతిన్. ౯౭

వ. నన్ను నెక్కడ దాఁచె దనుటయు సంధ్యాసమయానంతరంబ
యంధకారంబున నయ్యుత్పలగంధిం బురంబువెలికిం గొని
చని యొక్కపూఁదోఁటలోపల నత్యంతవిస్తారం బై తనరు
బూరువువ్రూనికోటరంబున నునిచి వేగుజామునప్పు డాకమ
లాకరు వంచించి నీపాలికిం జనుదెంచెద వెలువకుండు మని
యూఱడించె. ౯౮

సీ.........యతుణాలంకృతం బైన
సముదీర్ణభద్రగజంబు నెక్కి
కుంజరాఁదోళికాఘోటకారూఢు లై
ప్రాణమిత్రులు తమ్ముఁ బలసి కొలువఁ
బాఠకనికురుంబపఠనరవంబులు
గర్ణామృతంబు లై కరము మెఱయ
ముందట నెలకొన్న సందడిఁ దొలఁగించు
నురువేత్రహస్తులయుఱిది చెలఁగఁ

జారుతరదీపికాసహస్రములు వెలుఁగఁ
బెండ్లిశృంగారమునఁ జాలఁ బెంపు నొంది
యఖిలకమలాకరుఁడు కమలాకరుండు
రమణ మీఱంగ విదిశాపురంబు సొచ్చె. ౯౯

వ. అయ్యవసరంబున. ౧౦౦

క. మదగజఘోటకములతో
మృదుపాతకరవము చెలఁగ మే నలరంగా
నెదురుకొనియెఁ దనయల్లుని
విదిశాపురనాయకుండు విభవం బెసఁగన్. ౧౦౧

వ. ఇ ట్లెదురుకొని తోడ్కొని చని దైవయోగంబున హంసా
వళీభావంబు గలిగి కా దని యెఱుంగరాని కమలమంజరిని
మహావైభవంబున వివాహంబు గావించుటయు నాఁడ వి
శేషశుభదినం బగుట నశోకకళికతోడ నయ్యిందువదనం
దోడ్కొని కరదీపికాసహస్రంబులు ప్రజ్వరిల్లం గమలాకరుం
డు శిబిరంబున కరుగునప్పుడు కుంజరంబుమీఁద నన్నరేంద్ర
కుంజరు వెనుక నున్న కృతకహంసావళి తాను రాజనందన
ననిచి వచ్చిన శాల్మలీపాదపంబుఁ గనుంగొని యత్తరుణి
తా నత్తరువు దహించునుపాయం బూహించి యొడలికి వ
డంకు దెచ్చుకొని పతిం గౌఁగిలించిన. ౧౦౨

క. మఱఁగి కనుంగొని ధరణీ
తలవిభుఁ డిది యేమి యనినఁ దాఁ బలుకక క
న్నులు మోడ్చి యుండెఁ బలుమఱుఁ
దెలుపఁగ నొకకొంతవడికిఁ దెలిసినభంగిన్. ౧౦౩

వ. కన్ను లోకించుక దెఱచి యీ రెలుంగున నతనికి వినవచ్చు
నట్లుగా ని ట్లనియె. ౧౦౪

మ. అలభూజంబుననుండి దైత్యపతి యత్యాభీలభంగిన్ దృగం
చలముల్ నిప్పులవెల్లిఁ గొల్ప ననుఁ దాఁ జంకించినన్ భీతిమై
నులుకం గన్నులు మోడ్చి భ్రాంతమతి నై యున్నంత నా
ప్రోల నుజ్జ్వలవిప్రాకృతిఁ దోఁచి యి ట్లనియె వాత్సల్యం
బు దీపింపఁగన్. ౧౦౫

ఉ. ఇక్కుజ మగ్నిదేవునకు నిప్పుడ యాహుతి చేయఁ ద్రుంగు
నీ రక్కసుఁ ద్రుంపకున్న నిది రాసుతుతో మననీదు నిన్ను
నీ, వెక్కుడుభీతిమైఁ గలఁగ నేటికి నీపతితోడ నింతయున్
గ్రక్కున చెప్పు మంచరిగ పోఁకును బోయఁ దొడంగె నం
తటన్. ౧౦౬

క. నావుడు నే నవ్విధమును
వేవే చేయింతు నీవు వెఱవకు మని దం
తావళము నిలువఁ బంచి మ
హీవిభుఁ డయ్యింతి ప్రోల నిడుకొని కడకన్. ౧౦౭

క. భటకోటిఁ జూచి యీ రీ
విటపిని దహియింపుఁ డనిన వెసఁ గాష్ఠము లో
క్కట మొదల నొంటి యందు
త్కటముగ నలుదెసల నగ్గి దరికొల్పి రొగిన్. ౧౦౮

సీ. అంతకముంద యయ్యగకోటరంబున
నురగభయంబుచే నుండ నోడి
హంసావళి తొలంగి యుత్తోటయుం దొక్క
చో నొకపాదరింటిలోన నుండి

యమ్మహీజము గాల నడరు పెన్మంటలఁ
బగలింటిగతి దీప్తి పరఁగుటయును
బహుశతకరదీపపంక్తులు వెలుఁగొంద
భద్రగజంబుపైఁ బ్రజ్వరిల్లఁ
గమలమంజరిమ్రోల డగ్గఱి వసింప
నతిమనోహరమూర్తిఁ బెం పందియున్న
చెలువుఁ గమలాకరుని గన్నులలరఁ జూచి
యుచ్చరువు రాగశోకంబు లాత్మఁ దనర. ౧౦౯

క. రాచిలుక మున్ను వ్రాసిన
యాచిత్రము గజము మీఁది కరుదెంచిన య
ట్లే చూపులపండువ యగు
నాచెలువుని చెలువ మాత్మ నలరింపంగన్. ౧౧౦

శా. ఈ రాజాశుకరాజు చెప్పినతఁ డా నీచెల్వు చెల్వంబుఁ గ
న్నారం గన్గొని కాముబారిఁ బడి మాయల్వన్ని నన్నాపి నే
ర్పారంగా వరియించె నన్నిఁకకి నాహారంబు గావించెఁ బెం
పార న్నాకొఱకై కుజంబు నిటు సేయం బంచెఁ బాపాత్ముఁడై.

సీ. ఈవరు మదిఁగోరి యుచటి కేతెంచిన
నదలోన ననుమాన మేల పుట్టు
వరునియున్నడకు బవ్వనిఁ బంపఁ దగ దన
కేల పంపితి దీని సితనికడకు
నితని నిందించిన నిట్టివాఁడు నృపాలుఁ
డే యనబుద్ధి నాకేలపుట్టె
హీనభావునకు నన్నీఁడని మొఱఁగియు
నాతండ్రి మది నేల నమ్మనైతి

నిట్టిపాతకిఁ జెలిఁ జేసినట్టి బ్రహ్మ
యిన్నివిధములఁ దెలియంగ నేలయిచ్చు
నిన్నియును నేల యతఁడు ప్రాణేశ్వరుఁడుగ
నోము నే నోమఁగాక తొల్లాబ్బమునందు. ౧౧౨

క. ఈయింతి తలఁచినట్లుగ
నీయగ్నిం గాలనైతి నీభూజముతోఁ
గాయజువవహ్నుల నిచ్చలు
నేయనువునఁ గాలుదాన నింకిట విధియా. ౧౧౩

వ. అనుచుఁ గన్నీరు వెల్లిగొన సన్నిధజనయన బహుప్రకారం బులం బలవించుచుండె నంత నమ్మహామహీరుహంబు హా తాశనుని కశనంబు చేసినదాన సంతుష్టహృదయ యైన య య్యింతితో శిబిరంబున కరిగియున్నంత. ౧౧౪

క. కమలాకరుమై దైవకృ
తమునం బ్రబలజ్వరంబు దనుకొందుటఁ గృ
త్రిమహంసావళి తనచి
త్తమునం జింతింపఁ దొడఁగెఁ దద్దయు భీతిన్. ౧౧౫

గీ. శిరమునందు హంసావళి కరముపెట్ట
జ్వర మతిత్వరగతి మాను జనుల కనుచు
విన్నవాఁడిప్డు నన్ను నివ్విధముచేయఁ
బనిచి బొంకైన నవమాన పడు విభుండు. ౧౧౬

క. నాఁచెలి యశోకకలికయు
నాచేసిన చేఁత తెలుఁగు నరపతి యడుగన్
వే చెప్పెనేని నక్కట
యేచాద మొనర్పుదాన నేనిటమీఁదన్. ౧౧౭

వ. అని చింతించి యనంతరంబ యొక్క తెఱంగు గాంచి శూన్య లింగంబున ఛాగరక్తాభిషేకంబును దన్మాంసపూజనంబును నరబలియు నొనర్చిన జ్వరశాంతి యగునఁట మున్నొకజోగి ణిచే వింటి నని యశోకకలికతో నరబలిప్రకారంబు చెప్పక తక్కనవిధంబు చెప్పి శివలింగస్థానంబునకుం దోకొని చని యేమఱించి వధియించి యీయాపద నిర్వహించెద నని ని శ్చయించి యప్పాలంతితోడం జెప్పవలయు వార్తలు చెప్పి ప్రతీహారపాలాధ్యక్షుం డగు వృద్ధు రావించి. ౧౧౮

సీ. వసుమతీశ్వరునకు జ్వరము మానంగ ర
క్షావిధికృత్యముల్ సలుపవలయు
నర్ధరాత్రమునప్పుఁ డాఁడువారెవ్వరు
వెడలివచ్చిన నడ్డపడకుఁ డనుచుఁ
జెప్పి పోవఁగఁబంచి చెలియును దానును
ఛాగపూజాద్రవ్యచయముగొనుచు
నసిహస్తయై శూన్యవారగృహమ్మునకేగి
యజరక్తమజ్జనం బాచరించి
యత్యుతివ శంభుపూజ సేయంగఁబంచి
తత్పరతఁ బూజ యొనరించుదానిఁ జేరి
తద్గళము ద్రేయుటయు హేతిధారదప్పి
దైవవశమున నడ్డంబు దాఁకుటయును. ౧౧౯

వ. అశోకకళికయు బెగ్గిలి యగ్గలంపు హాహారవంబు లెసంగ గుడివెడలి పఱవం దొడంగిన. ౧౨౦

క. తలయును జీరయు వీడఁగ
బలుబూతము వోలె వెంటఁ బడి చనుదేరం

దలఁకుచు నశోకకళికయు
నెలుఁ గెత్తి విషాద మడర ని ట్లనిపలికెన్. ౧౨౧

గీ. పాడుగుడిలోని భూతము గూడముట్టి
వెన్నడింపఁగఁ దొడఁగె నో యన్నలార
కంటిరే యని మొఱవెట్టఁగాఁ దొడంగ
నయ్యెలుఁగు విని తలవరు లడ్డగించి. ౧౨౨

వ. వస్త్రప్రావరణయు నాలంబకేశభారయు నాభీలకరవాలహస్త
యు నై దానివెంటం బఱతేర వారలు గనుంగొని భూతం
బనుచుం బొదివి పలుతునియలు గావించిన. ౧౨౩

గీ. ఆయ్యశోకకళిక యార్తనిర్ముక్త యై
యంతిపురము సొచ్చె నంతలోన
శంభుపూజకతన జ్వరముక్తుఁ డై యున్న
మనుజవిభునిఁ జేరి వినత యగుచు. ౧౨౪

వ. కమలమంజరి చేసిన కపటకృత్యం బెఱింగించిన నరసి వెఱఁ
గుపడి హంసావళివలని బలవంతం బైన వలవంత నొందుచు
నాక్షణంబున మంత్రుల రావించిన నందఱుం జింతాక్రాం
తు లై యున్నసమయంబున భీమభటుండు జ్యోతిశ్శాస్త్ర
పారగుం డైన వసంతకు నాలోకించి ప్రశ్నం బడిగిన.

గీ. అనలనిహతిఁ బడదు హంసావళీకన్య
నేమమున్న నరేంద్రుఁ జేరు ననిన
మదిఁ దలంకు మాలి మాళవాధిపున క
వ్వార్తఁ జెప్పెఁ దగినవారిఁ బనిచి. ౧౨౬

వ. భీమభటుండు దిగ్గన లేచి మనసేర్పువిధంబున మాళవేంద్ర

కన్య నరయింతము రం డని చెలులం దోడుకొని యత్యంత
సంభ్రమంబునం జని. ౧౨౭

మ. సరసానందన సత్కళాగమపరీక్షాకృష్ణకందార భా
స్వరనానారసభావనిర్మథనభోజక్ష్మాప విద్యానిరం
తరగోష్ఠీజగదేకమల్ల బహుశాస్త్రగ్రంథసిద్ధాంతవి
స్తరవిజ్ఞానకవిత్వతత్త్వకలనాసర్వజ్ఞసోమేశ్వరా. ౧౨౮

క. వీణావాదనచలదలి
వేణీవేణీప్రసూనవిహరన్మధుప
శ్రేణీగానాకర్ణన
ఘూర్ణీకృతనేత్ర హారితగోత్రపవిత్రా. ౧౨౯

లయగ్రాహి.
చంద్రరుచిరానన మహేంద్రబహుభోగ భుజ
గేంద్రమృదుభాషణ దినేంద్రసమతేజా
సాంద్రశుభలక్షణ ధనేంద్రధనవైభవ మృ
గేంద్రపటువిక్రమ గిరీంద్రనిభధైర్యా
మంద్రజయఘోషణ ఖగేంద్రజవవాహన శి
బీంద్రఘనదాన మనుజేంద్రహితకృత్యా
కుంద్రమతిజృంభణ రతీంద్రలలితాంగక గ
జేంద్రబలబంధుర కవీంద్రనుతకీర్తీ.

గద్యము. ఇది శ్రీమద్వెన్నెలకంటి సూరనామాత్యపుత్ర హారి
తసగోత్ర పవిత్ర సుకవిజనమైత్రీ విధేయ అన్నయనామధే
యప్రణీతం బైన షోడశకుమారచరిత్రంబు నందు సప్తమా
శ్వాసము.

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము.

## అష్టమాశ్వాసము.

క. శ్రీభాసమాననానా
వైభవ జయలాభ.........సనితాంత
స్వాభా......తసారభ
శోభితపాండిత్య యన్నసూరామాత్యా. ౧

వ. .........మంబులు గడపి విరహతాపోపశమనార్థంబు మహీతలనాథుండు శీతలచ్ఛాయ నొక్కరుండును నాసీనుండై యుండి యశోకకలిక నచ్చటికిం బిలువం బంచి సమీపంబున నునిచికొని హంసావళి యే మయ్యె......... ౨

క. భూనాథ కమలమంజరి
తో నాఁడటు నేను వరిగి తుదముట్టంగా
మానుఁగ నవ్విధ మంతయు
నే నెఱుఁగుదు విన్నవింతు నేర్పడ నీకున్. ౩

వ. సకలలోకాభిరామం బగునారామారత్నం బొక్కనాఁడు నరత్నాగారంబున కరిగి తదీయమణికుడ్యభాగంబునందు. ౪

చ. నరవరముఖ్య నీ దయిన నవ్యమనోహర మైనరూపు చిత్తరువున వ్రాసి యున్నఁ గని తద్దయు వేడ్కలు నివ్వటిల్లఁ

గా, నరులున తెప్పవెట్టక చలాకృతిగుం......నేపుదానుజి
త్తరువునఁబోలె నుండి వనితామణి రాగపయోధిమగ్న యై.

వ. అప్పుడు—

సీ. సుదతి యారూపంబు చూచినయట్లైన
లీలమై తెప్పలు వ్రాలవైచు
భామ యారూపంబు పలికినయట్లైన
వేడుక మాటలు వినఁగఁ గోరు
నింతి యాహూపు ద న్నెలయించినట్లైన
నర్థిఁ జేరఁగఁ జన నప్పళించుఁ
గాంత యారూపంబు గదిసినయట్లైన
నాలింగనము సేయ నాససేయు
నివ్విధమునఁ జిత్త మెంతయుఁ దగిలినఁ
దన్ను మఱచి యుండె ధవళనయన
లలితచిత్ర మగుటఁ దెలిసియుఁ దెలియక
మరుఁడు దన్ను మిగుల మరులుకొలుప. 2

వ. ఇట్లత్యంతసుందరం బగు నచ్చిత్రరూపంబుఁ జూచి యిచ్చ
ట నీరూపం బెవ్వరు వ్రాసి రని యడిగిన సకలవిద్యావిశార
దత్వంబు... ... ... ౩

చ. ... ... ... ...
... ... ... నొప్పెసలార రక్తచం
దనమున వ్రాసి యింతి మఱునాఁడు ప్రమోదము నివ్వటి
ల్లఁగన్. ౯

క. చిలుకఁ బిలిపించి రసవ
త్ఫలములు పసదనము నిచ్చి తథ్యసువర్ణో
జ్జ్వలచేల మొసఁగి సద్గుణ
కలితా పురుషార్థనిధివి గమ్మని పలికెన్. ౧౦

క. ఆర్యనుతిపాత్ర మగున
య్యార్యఁ జదివి చూచి మెచ్చి యాశుకమును రా
పార్య వగునీకు శిఖిచం
ద్రార్యమనయనసము నమ్మహాత్మునిఁ దెత్తున్. ౧౧

వ. అని పలికి సముచితప్రకారంబున వీడుకొని రాజశుకంబు చ
నుట యు నది యవశ్యంబు నిన్నుఁ దెచ్చు ననునాస నూఱ
డి యనేకదివసంబు లెదురుచూచి రాక తడసిన నొక్కనాఁ
డమ్మంజువాణి కమలమంజరి దెసఁ గనుంగొని. ౧౨

క. ఆచిత్రాకృతి పతి దృ
గ్గోచరుఁ డగుటయును గల దొకో యొకనాఁ డా
రాచూలిని నిట్లన వల
రాచయురులఁ బెట్టు నొక్కొ రాచిలుక చెలీ. ౧౩

క. మెచ్చు నొకో యార్య యిచ్చకు
వచ్చు నొకో రాజశుకమువాక్యము లతనిం
దెచ్చు నొకో చిలుక యెంతకుఁ
దెచ్చు నొకో మరుఁడు నన్నుఁ బతిఁ దే కున్నన్. ౧౪

వ. అనినఁ గమలమ్మంజరి యి ట్లనియె. ౧౫

క. నీచెలువము రసికాగ్రణి
యాచిలుక నుతింప మిగుల నరయుక యుండఁగా

నీచిత్తమువాఁడే పతి
యోచెలి యిటు లేల చింత నొందఁగ నీకున్. ౧౬

వ. అనిన నమ్మాటకు నెమ్మనమున నమ్మిక జనింపకున్న నచ్చె
లువ నెచ్చెలి నాలోకించి. ౧౭

ఉ. ఓజలజాక్షి నీవు నను నూఱడఁ బల్కెదు గాక వచ్చునే
రాజశుకంబు, వీడ్వడలి రమ్మనిన న్నను నేల, నమ్మహా
రాజున కిచ్చఁగూర్చి యిటు రా మన మెక్కడ నాతఁ డెక్క
డే, యోజఘటించుఁ గార్యము శుకోక్తుల ని ట్లడియాస వె
ట్టునో. ౧౮

క. అని పలుమఱుఁ దలపోయఁగ
దినదినమున కంగజుండు ధృతి దూలింపన్
మనమునఁ గలఁగుచుఁ దేఱుచు
ఘనపరితాపంబుచేతఁ గ్రాఁగఁదొడంగెన్. ౧౯

మ. ప్రిదిలెం జేతులకంకణంబులు సఖీబృందంబుపై మచ్చికల్
వదలె న్మత్తమధువ్రతారవముల న్వాసంతికావహ్నిచే
నదలెన్ ధైర్యము చిత్తసంభవశరవ్యం బై మనోబ్జంబు గ్ర
క్కదలెన్ మైఁబరితాపవహ్నిపొదలెం గంజాతపత్రాక్షికిన్.

వ. అవ్విధంబు గనుంగొని కమలమంజరి చిత్తంబునఁ జలింప నె
చ్చెలి నవలోకించి. ౨౧

గీ. చిలుక వెంటన వలరాచచిచ్చు దగిలి
యకట పన్నీరు చల్లిన నాఱిపోదు
పుష్పధూళి పైఁ బోసినఁ బొనుఁగుపడదు
కొమ్మ నేఁ డేయ నోపుదు నమ్మలార. ౨౨

గీ. ఇందులోన నెవ్వారికి నెఱుకలేద
యకట పూఁబొన్పు చేసెద మనుచుఁ దెచ్చి
భావసంభవునమ్ములపాన్పుమీఁద
ముదితఁ బెట్టినవారలు మోసపోయి. ౨౩

వ. అని యయ్యింతివలవంతసూచి నెచ్చెలులు పలుమాటల వ
లరాజు నుద్దేశించి. ౨౪

గీ. పద్మభవునిమీఁదఁ బంకజోదరుమీఁద
హరునిమీఁద వేసినట్టిశరము
నబలమీఁదఁ జాల నదయత నేయంగఁ
బంచబాణ నీకుఁ బాడి యగున. ౨౫

వ. అని పలికి యేమిట నమ్మగువమేన నుద్దీపించిన మదనతాపం
బు వాయకున్న ని ట్లనియె. ౨౬

చ. హరునిటలాగ్ని రూపఱియు నంగజుఁ డవ్విడ పుట్టె రాఘు
వేశ్వరుఁడు శపించినం బికరవంబులు గ్రమ్మఱఁ గల్గె రా
హు ని,ష్ఠురగతిఁ బట్టి మ్రింగినను సోముఁడు వెల్వడివచ్చెఁ
జెల్లఁబో, విరహులఁ బొందియున్నశని వీడియు వీడద యేమి
సేయుదున్. ౨౭

వ. అని పలికి యిందువదనకు మనసేయు చలిమందుల మదన
తాపంబు దీపించె నింక నివి వల దని శిశిరోపచారంబుల పని
చాలించి చింతింపం దొడంగిన నక్కమలముంజరిం జేరం జని.

మ. తరుణీ నే నొకసిద్ధపుంగవుని నత్యంతంబు సేవించి యే
నరు లేరూపులు సూడ నర్థివడినం దద్భావము ల్గొంతసే
వరుదారం బొడసూపవచ్చువరవిద్య న్వేఁడికొన్న న్మనో
హరభావస్ఫురదింద్రజాలవరవిద్య న్నాకు నిచ్చెన్ దయన్.

క. ఈపాలఁతికిఁ గమలాకర
రూపముఁ దద్విద్యపేర్మి రూపెసలారం
జూపుడును దాన మన్మథ
తాపంబు శమించుఁ దెలివి దలకొను ననినన్. ౩౦

క. ఆచెలువుని చిత్రాకృతి
చూచినయట్లైన రూపుచూచిన మరుచే
నేచంద మగునొ మాన్ప న
గోచర మున్మాదవృత్తి గూరినయేనిన్. ౩౧

క. అనునంతటఁ గమలాకరుఁ
డనుభూపతి వాహినీచయంబులతోఁ బెం
పెనయఁగ వేత్రవతీవా
హినిదరి విడిసె నని పౌరు లెల్లఁ బెదరన్. ౩౨

క. నీ వరుగుదెంచి తని హం
సావళి దెలివొందుటయును నానందలస
ద్భావమున నంతిపురమున
నావెలఁదిని గొనుచు బోటు లరిగెదు నంతన్. ౩౩

గీ. అడుగఁ బుత్తెంచుటయుఁ గమలాకరునకుఁ
బుత్రి నీ నిశ్చయము చేసె భూమిపాలుఁ
డనుచుఁ బరిచారికలు చెప్పికొనఁ గడంగ
సతికి విధికృతి నాత్మ సంశయము పుట్టె. ౩౪

క. ఆకీరము చెప్పిన కమ
లాకరుఁడో యున్నరేంద్రుఁ డన్యుఁడొ యని చిం
తాకులతఁ గమలమంజరి
నీకడకుం బనుప మరుఁడు నికృతి యొనర్చెన్. ౩౫

క. కమలాక్షికిఁ బ్రాణము ప్రా
ణము తత్సఖి కీడుసేయునా తలఁపఁగ నీ
కమనీయమూర్తి విభవము
కమలాననబాము మాన్పఁగలిగెఁ గుమారా. ౩౬

క. నీవిడిసియున్నయది హం
సావళి విహరించు తోఁట యనవరతంబున్
భూవల్లభ యం దాడుదు
మావనితయు మేముఁ జాల ననుమోదమునన్. ౩౭

సీ. ఈచంపకముపొంత నీమావిక్రీనీడ
మానినీరత్నంబు మరుని నోఁచె
నీమాధవీలత నీయశోకముతోడ
నబ్జలోచన వివాహంబు చేసె
నీకేళకుళిలోన నెలనాఁగ ప్రోదిరా
యంచలకవల నిండించి యాడె
నీపువ్వుఁబొదలలో నీరత్నవేదిపైఁ
జెలువ బొమ్మలపెండ్లి చేసె మున్ను
భూపనందన యీసారపొన్నపొంత
ముత్తియంబులపందిరి ముదిత వెట్టెఁ
బ్రేమ నాడెడుచోట నీభామ చూపె
మానవేంద్రునిహృదయంబు మరులుకొనఁగ. ౩౮

సీ. ఈహంసయానంబు నింతయొప్పయి యున్న
యతివ యిక్కడ గెడయాడనేని
యీపుష్పములతావి యింతలెస్సయి యున్న
సుందరిమోము తావి సుడిసెనేని

యీచిలుకలమాట లింతయుం బయి యున్న
వెలఁదితిన్ననిపలుకు వింటిమేని
యీతేఁటిగమిచాయ యింతయొ ప్పయి యున్నె
సుదతివేనలి చూచి చూతుమేని
పూవుఁబోఁడి హంసావళి యీవనమున
వేడ్క విహరింపకుండుట వీని కెల్ల
నింపు సమకూరెఁగాక యయ్యింతి యున్న
మనకు నింపుఁ జేయునొ యివి మానవేంద్ర. ౩౯

వ. అనినమాటలు విని యనురాగంబు నివ్వటిల్ల. ౪౦

సీ. పొలఁతి కౌఁగిటఁ జేర్పఁ బూచి నెత్తావుల
క్రోవి యైనదియె యీక్రోవి యొక్కొ
మానినిగండూషమధుపుసోఁకునఁ బూచి
పొగడ నొప్పినది యీపొగడ యొక్కొ
నలినాక్షిపదతాడనంబునఁ బూచి శు
శ్లోక మైనది యె యశోక మొక్కొ
మెలనాఁగ మెఱుఁగుఁజూపులఁ బూచి భూజాత
తిలక మైనదియె యీతిలక మొక్కొ
యివ్వనములోన నిన్నియు నెఱుఁగకున్నఁ
దరుణికౌఁగిటఁ జేర్చిన కురవకంబు
నాకుఁ జూపినఁ బరిరంభణంబు చేసి
నట్టు లైనఁ గృతార్థుఁడ నగుదు నబల. ౪౧

క. అని యంత మదనతాపము
ఘన మగుటయు సైఁపలేక కాంతా నీనే

ర్చినయింద్రజాలవిద్యను
వనజాననరూపు చూప వలయు ననుటయున్. ౮౨

వ. తనవిద్యాప్రభావంబున రాజకన్యమోహనాకారంబు దృగ్గోచరంబు గావించిన, ౮౩

క. వనజాస్యమోహనాకృతి
కనుఁగవ కతికౌతుకంబు గావించుటయుఁ
మనమున మాయారూపం
బని తెలియఁగ మఱచి చాల ననురక్తుం డై. ౮౪

సీ. తళతళఁ బర్వెక్రొమ్మెఱుఁగుఁదండములం బురణించుమేనినుం, దళపమునందుఁ(?) జూపులు మనంబునఁ జిక్కినఁ గ్రమ్మఱింపలే, కలికులవేణి తెప్ప యిడ కానరపాలుఁడు సగాచుచుండె ని,శ్చలమతిఁ గాముతూపులకు జానఁగ నిల్చిన దెప్పమో యనన్. ౮౫

సీ. నత్తమ్మిరేకుల నెచ్చెలు లై యొప్పు
మృదుపదంబులమీఁద మెలఁగిమెలఁగి
నునుమంచు మించునం గనకకుంభమ్ముల
కెనమైనచనుఁగవ నెక్కి నెక్కి
కందని యిందుని యందంబు నొందిన
చిఱునవ్వు నెమ్మోముఁ జెందిచెంది
మెఱచినతొలుకారు మెఱుఁగులకవలైన
చెలువుఁజూపుల మీఁదఁ బొలసిపొలసి
ముదితయనుపమానమోహనాకారంబు
చాల మరగి యానృపాలుచూడ్కి

తీపుమిగులఁ బువ్వుఁదేనియఁ గ్రోలి మ
త్తిల్లి కడల నున్న తేఁటిఁబోలె. ౪౬

వ. ఇవ్విధంబున నంగజాధీనుం డైన యమ్మానవేంద్రుండు.

సీ. వనజాక్షి కెంగేలుఁ దన కేలుఁ గీలించి
కేళికిఁ దివియంగ లీలఁ గడఁగు
నంగనామణిమోహనాంగవల్లికఁ జాల
నాలింగనముసేయ నప్పళించుఁ
జెలువతీపారెడు చిగురాకుఁ గెమ్మోవి
నాదట గముపంగ నాససేయు
నెలనాఁగ మెలపారు నిఱిచన్నుఁగవకాంతి
ననురక్తిఁ గబళింప నగ్గలించు
నివ్విధమునఁ దమక మెంతయు మిగులంగ
సతివఁ జేరఁ గోరునవసరమునఁ
దోయజాక్షిరూపు మాయమై పోయినఁ
జాల ఱిచ్చవడు నృపాలసుతుఁడు. ౪౭

వ. ఆయింద్రజాలకలితమాయారూపం బని యెఱుంగనేరక మద
నావేశంబుకతంబున హంసావళియ కా నిశ్చయించి యార
మణి నన్నుఁ గారవింపంగోఁ దలంచి యవ్వనంబునం దాఁగె
నని యూహించి పూఁబొదల నోలఁబుల వెదకి వెదకి యు
న్మాదంబుం బొంది. ౪౮

సీ. అదె నాకు నెలుఁ గిచ్చె నంగన యని యేగి
కలకంఠ మది యైనఁ గళవళించు
నదె మాటలాడెఁ జంద్రానన యని చేరి
శుకభాషణము లైన సొలపు నొందు

నదె తల చూపె నీలాలక యని డాసి
తుమ్మెదపొద మైనఁ దూలపోవు
నదె చీరెఁ జేసన్న నబ్జాక్షి యని చేరి
యెలమావి చిగురైన నిచ్చఁ గలఁగుఁ
దడవి కాననిచోటను దడవఁబోవు
నేల పొడసూపి మాయమై తివ్విధమున
నలఁపఁదగునె హంసావళి యనుచు దూఱు
భావజన్ముండు గారింప భూవిభుండు. ౫౦

ఇవ్విధంబున మన్మథోన్మాదబాణవిదారితమానసుండగుచుఁ గొంతతడ వవ్వనాంతరంబున జరించినంత నత్యంతసంభ్రమంబున వసంతకుం డచ్చటికిం బఱతెంచి హంసావళీకన్య యున్నది యనుపలుకు మున్నుగా నన్నరనాథునితో ని ట్లనియె.

సీ. అధిప హంసావళి యాబూరుగున నుండ
కోకపువ్వుఁ బొదలోన నుండి రాత్రి
యనలంబుచేత నేయాపదఁ బొందక
బ్రదికియుండంగఁ బ్రభాతవేళఁ
బూవులకై పువ్వులావిక లేగి యా
కోమలిఁ గాంచి తోకొనుచుఁ బోయి
యంతఃపురంబున నడలెడుతల్లియు
జనకుండు నున్నెడ కనుచుటయును
వార లెంతయు వెఱఁగంది వచ్చి గ్రుచ్చి
యత్తి కౌఁగిటఁ జేర్చి యుండండ పేర్చి
క్రమ్మఱ కన్నీటితోడుత నుమ్మలించి
యమ్మ బ్రదికి యేగతి వచ్చితమ్మ యనుచు. ౫౧

గీ. కన్ను నీరు దుడిచి కన్నియ నూరార్చి
పాపజాతి బోటిపాటుఁ జెప్పి
నేఁడు పెండ్లి యంచు నెమ్మి వ్రుట్టఁగఁ బల్కి
వాఁడె మనకుఁ జెప్ప వచ్చె ననిన. ౫౩

వ. ఆనందకందళితమానస యయ్యె నప్పుడ మ్మేఘమాలనరేం
ద్రుండు విభవంబున నక్కమలాననం దోడ్కొని చని. ౫౪

క. తొడవులు తనులత నునిచినఁ
గడునొప్పయి యుండి తొంటికంటెను రుచితోఁ
బడఁతుకయంగము తొడవులు
తొడవనియెడు పలుకుపలుకుఁ దొడవై మెఱయున్. ౫౫

వ. ఇవ్విధంబున నచ్చెలు లచ్చెలువకు శృంగారంబు చేసి రయ్య
వసరంబున నక్కడ. ౫౬

సీ. వాహననికురుంబవల్లరీజృంభిత
కాంచనకింకిణీక్వణనములును
మాణిక్యమండనమండితగాణిక్య
మంజులమంజీరశింజితమును
వాంశికవైణికవందిబృందానేక
వేణువీణాస్తుతక్వాణములును
లాసికామోహనలాస్యలీలోచిత
మర్దళమురజాదిమహితరవముఁ
గర్ణచామరసౌవర్ణకర్ణలలిత
వర్ణకంబళభూషణవ్రాతకలిత
దంతిఘంటారవంబులుం దనరుచుండఁ
గదలెఁ బెండిలికొడుకు పెక్కు లొలర్ప. ౫౭

అంతఁ జిరంటికాజనము లల్లన వచ్చిరి రాజు ముందటం
గ్రంతకు నైనవస్తువులుఁ గాంచనపాత్రలుఁ గొంచు సంతతా
తాంతలతాంతకోరకవిలాసమనోహరపల్లవావళీ
కాంతఫలావలుల్ దనరఁ గామమనోహరవల్లికాకృతిన్.

ధమ్మిల్లములఁ బువ్వుదండలచెలువంబు
సూసకప్రభలును సొబగు నొంద
నలికకస్తూరికాతిలకవిభ్రమములుఁ
గుంతలరోచులుఁ గొమరుమిగుల
రంగార నలఁదిన యంగరాగంబులుఁ
జీనాంబరంబులుం జెలువుమిగుల
భాసురమోహనాపాంగమరీచులుఁ
గర్ణభూషణములుం గలసి బెరయ
నంగదీప్తులుఁ దొడవులు నవఁగి పెనఁగి
విదితపార్వతీకల్యాణవిభవవినుత
గానములు కర్ణపర్వము గ్గాఁగ నడచు
పేరటాండ్రయందంబులు బెడఁగుఁజేసె. ౫౯

ఇవ్విధంబున విభవంబులు మెఱయఁ బురంబుం బ్రవేశించిన వైభవసురేంద్రుం డైన మాళవేంద్రుండు మించిన వేడ్క నెదురు చనుదెంచి తోడ్కొని పోవం దదీయమందిరంబు ప్రవేశించిన యనంతరంబున నర్హాజనంబు లయ్యేలనాఁగ వివాహవేదికాతలంబున నునిచి గండపటం బెత్తించి యయ్యెడకు నక్కుమారుం దోడ్కొని యరిగిన. ౬౦

ఉండిరి కాంతయుఁ బతియును
గండపడము మాటునందుఁ గడునింపులతో

క. ఈపాలంతికిఁ గమలాకర
రూపముఁ దద్విద్యపేర్మి రూపెసలారం
జూపుడును దాన మన్మథ
తాపంబు శమించుఁ దెలివి దలఁకొను ననినన్. 30

క. ఆచెలువుని చిత్రాకృతి
చూచినయట్లైన రూపుచూచిన మరుచే
నేచంద మగునొ మాన్ప న
గోచర మున్మాదవృత్తి గూరినయేనిన్. 3౧

క. అనునంతటఁ గమలాకరుఁ
డనుభూపతి వాహినీచయంబులతోఁ బెం
పెనయఁగ వేత్రవతీవా
హినిదరి విడిసె నని పౌరు లెల్లఁ బెదరన్. 3౨

క. నీ వరుగుదెంచి తని హం
సావళి దెలివొందుటయును నానందలస
ద్భావమున నంతిపురమున
నావెలఁదిని గొనుచు బోటు లరిగెడు నంతన్. 33

గీ. అమగఁ బుత్తెంచుటయుఁ గమలాకరునకుఁ
బుత్రి నీ నిశ్చయము చేసె భూమిపాలుఁ
డనుచుఁ బరిచారికలు చెప్పికొనఁ గడంగ
సతికి విధికృతి నాత్మ సంశయము పుట్టె. 3౪

క. ఆకీరము చెప్పిన కమ
లాకరుఁడో యిన్నరేంద్రుఁ డన్యుఁడొ యని చిం
తాకులతఁ గమలమంజరి
నీకడకుం బనుప మరుఁడు నిశ్మృతి యొనర్చెన్. 3౫

క. కమలాక్షికిఁ బ్రాణము ప్రా
ణము తత్సఖి కీడుసేయునా తలఁపఁగ నీ
కమనీయమూర్తి విభవము
కమలాననకౌము మాప్పఁగలిగెఁ గుమారా. ౩౭

క. నీవిడిసియున్నయది హం
సావళి విహరించు తోఁట యనవరతంబుల్
భూవల్లభ యం దాడుదు
మావనితయు మేముఁ జాల ననుమోదమునన్. ౩౮

ఈచంపకముపొంత నీమావిక్రీనీడ
మానినీరత్నంబు మరుని నోఁచె
నీమాధవీలత నీయశోకముతోడ
నబ్జలోచన వివాహంబు చేసె
నీకేళికుళిలోన నెలనాఁగ ప్రోదిరా
యంచలకవల నిందించి యాడె
నీపువ్వుఁబొదలలో నీరత్నవేదిపైఁ
జెలువ బొమ్మలపెండ్లి చేసె మున్న
భూవనందన యీసారపొన్నపొంత
ముత్తియంబులవందిరి ముదిత వెట్టెఁ
బ్రేమ నాడెడుచోట నీచాయ చూపె
మానవేంద్రునివ్యాదయంబు మరులుకొనఁగ. ౩౯

సీ. ఈహంసయానంబు నింతయొప్పయి యున్నె
యబలిక యిక్కడ గెడయాడెనేని
యీపుష్పములతావి యింతలెస్సయి యున్నె
సుందరిమైతావి సుడిసెనేని

యీచిలుకలమాట లింతయుం బయి యున్నె
　　　వెలఁదితిన్ననిపల్కు వింటిమేని
యీతేఁటిగమిచాయ యింతయొ ప్పయి యున్నె
　　　సుదతి వేసలి చూచి చూతుమేని

పూవుఁబోఁడి హంసావళి యీవనమున
వేడ్క విహరింపకుండుట వీని కెల్ల
నింపు సమకూరెఁగాక యయ్యింతి యున్న
మనకు నింపుఁ జేయునొ యివి మానవేంద్ర. ౩౯

వ. అనినమాటలు విని యనురాగంబు నివ్వటిల్ల. ౪౦

సీ. పొలఁతి కౌఁగిటఁ జేర్పఁ బూచి నెత్తావుల
　　　క్రోవి యైనదియొ యీక్రోవి యొక్క
మానినిగండూషమధుపుసోఁకునఁ బూచి
　　　పొగడ నొప్పినది యీపొగడ యొక్క
నలినాక్షిపదతాడనంబునఁ బూచి శు
　　　శ్లోక మైనది యె యశోక మొక్క
యెలనాఁగ మెఱుఁగుఁజూపులఁ బూచి భూజాత
　　　తిలక మైనదియొ యీతిలక మొక్క

యివ్వనములోన నిన్నియు నెఱుఁగకున్నఁ
దరుణికౌఁగిటఁ జేర్చిన కురవకంబు
నాకుఁ జూపినఁ బరిరంభణంబు చేసి
నట్టు లైనఁ గృతార్థుఁడ నగుదు సబల. ౪౧

క. అని యంత మదనతాపము
ఘన మగుటయు నైఁపలేక కాంతా నీసే

ర్చినయింద్రజాలవిద్యను
వనజాననరూపు చూప వలయు ననుటయున్. ౪౨

వ. తనవిద్యాప్రభావంబున రాజకన్యమోహనాకారంబు దృగ్గో
చరంబు గావించిన, ౪౩

క. వనజాస్యమోహనాకృతి
కనుఁగవ కతికౌతుకంబు గావించుటయుఁ
మనమున మాయారూపం
బని తెలియఁగ మఱచి చాల ననురక్తుం డై. ౪౪

. తళతళఁ బర్వుక్రొమ్మెఱుఁగుఁదండములం బురణించుమేని
నుం, దళవమునందుఁ(?) జూపులు మనంబునఁ జిక్కనఁ గ్ర
మ్మఱింపలే, కలికులవేణి యెప్ప యిడ కానరపాలుఁడు సగా
చుచుండె ని,శ్చలమతిఁ గాముతూపులకు జానుగ నిల్చిన దె
వ్వమో యనన్. ౪౫

సీ. నెత్తమ్మిరేకుల నెచ్చెలు లై యొప్పు
మృదుపదంబులమీఁద మెలఁగిమెలఁగి
నునుమంచు మించునం గనకకుంభమ్ముల
కెనయైనచనుఁగవ యెక్కియెక్కి
కందని యిందుని యందంబు నొందిన
చిఱునవ్వు నెమ్మోముఁ జెందిచెంది
మెఱచినతొలుకారు మెఱుఁగులకవలైన
చెలువుఁజూపుల మీఁదఁ బొలసిపొలసి
ముదితయనుపమానమోహనాకారంబు
చాల మరగి యానృపాలుచూడ్కి

తీపుమిగులఁ బువ్వుఁదేనియ గ్రోలి మ
త్తిల్లి కడల నున్న తేఁటిఁబోలె. ౮౬

వ. ఇవ్విధంబున నంగజాధీనుం డైన యమ్మానవేంద్రుండు.

సీ. వనజాక్షి కెంగేలుఁ దనకేలుఁ గీలించి
కేళికిఁ దివియంగ లీలఁ గడఁగు
నంగనామణిమోహనాంగవల్లికఁ జాల
నాలింగనముసేయ నప్పళించుఁ
జెలువతీపారెడుచిగురాకుఁగెమ్మోవి
నాదట గముపంగ నానసేయు
నెలనాఁగ మెలపారునిజచన్నుఁగవకాంతి
ననురక్తిఁ గబళింప నగ్గలించు
నివ్విధమునఁ దమక మెంతయు మిగులంగ
సతివఁ జేరఁ గోరునవసరమునఁ
దోయజాక్షిరూపు మాయమై పోయినఁ
జాల చిచ్చువడు నృపాలసుతుఁడు. ౮౭

వ. అయింద్రజాలకలితమాయారూపం బని యెఱుంగనేరక మద
నావేశంబుకతంబున హంసావళియ కా నిశ్చయించి యార
మణి నన్ను గారవింపంగాఁ దలంచి యవ్వనంబునం దాఁగె
నని యూహించి పూఁబొదల నోలంబుల వెదకి వెదకి యు
న్మాదంబుం బొంది. ౮౮

సీ. అదె నాకు నెలుఁగిచ్చె నంగన యని యేగి
కలకంఠ మదియైనఁ గళవళించు
ఇదె మాటలాడెఁ జంద్రానన యని చేరి
శుకభాషణము లైన సొలపు నొందు

నదె తల చూపె నీలాలక యని డాసి
 తుమ్మెదపొద కైనఁ దూలఁబోవు
నదె చీరెఁ జేసన్న నబ్జాక్షి యని చేరి
 యెలమావి చిగురైన నిచ్చఁ గలఁగుఁ
దడవి కానని చోటను దడవఁబోవు
నేల షోడశరూపి మాయమ్మై తివ్విధమున
క. నలఁపఁదగునె హంసావళి యనుముదూఱు
భావజున్మందు గారింప భూవిభుండు. ౫౦

గ. ఇవ్విధంబున మన్మథోన్మాదబాణవిదారితమానసుండగుచుఁ గొంతతడ వవ్వనాంతరంబున జరించినంత నత్యంతసంభ్రమంబున వసంతకుం డచ్చటికిం బఱతెంచి హంసావళీకన్య యున్నది యనుపలుకు మున్నుగా నన్నరనాథునితో ని ట్లనియె.

సీ. అధిప హంసావళి యాబూరుగున నుండ
 కోకపువ్వుఁ బొదలోన నుండి రాత్రి
యనలంబుచేత నేయాపదఁ బొందక
 బ్రదికియుండంగఁ బ్రభాతవేళ
బూవులకై పువ్వులావిక లేగి యా
 కోమలిఁ గాంచి తోకొనుచుఁ బోయి
యంతఃపురంబున నడలెడుతల్లియు
 జనకుండు నున్నెద కనుచుటయును
వార లెంతయు వెఱఁగంది వచ్చి గ్రుచ్చి
యత్తి కౌఁగిటఁ జేర్చి యాందండఁ జేర్చి
క్రమ్మ కన్నీటితో డుఱు తుమ్మలించి
యమ్మ బ్రదికి తొఁగలి వచ్చితమ్మ యనుచు. ౫౧

గీ. కన్ను నీరు దుడిచి కన్నియ నూరార్చి
పాపజాతి బోటిపాటుఁ జెప్పి
నేఁడు పెండ్లి యంచు నెమ్మి వుట్టఁగఁ బల్కి
వాఁడె మనకుఁ జెప్ప వచ్చె ననిన. ౫౩

వ. ఆనందకందళితమానస యయ్యె నవ్వాడ మేన్మఖమాలనరేం
ద్రుండు విభవంబున నక్కమలాననం దోడ్కొని చని. ౫౪

క. తొడవులు తనులత నునిచినఁ
గడు నొప్పయి యుండి తొంటికంటెను రుచితోఁ
బడఁతుకయంగము తొడవులు
తొడవనియెడు పలుకుపలుకుఁ దొడవై మెఱయున్. ౫౫

వ. ఇవ్విధంబున నచ్చెలు లచ్చెలువకు శృంగారంబు చేసి రయ్య
వసరంబున నక్కడ. ౫౬

సీ. వాహాననికురుంబవల్లరీజృంభిత
కాంచనకింకిణీక్వాణనములును
మాణిక్యమండనమండితగాణిక్య
మంజులమంజీరశింజితమును
వాంశికవైణికవందిబృందానేక
వేణువీణాస్తుతిక్వాణములును
లాసికమోహనలాస్యలీలోచిత
మర్దళమురజాదిమహితరవముఁ
గర్ణామరసౌవర్ణకర్ణలలిత
వర్ణకంబళభూషణవ్రాతకలిత
దంతిఘంటారవంబులుం దనరుచుండఁ
గదలెఁ బెండిలికొడుకు వేడ్క [illegible]దలిర్ప. ౫౭

ఉ. అంతఁ జిరంటికాజనము లల్లన వచ్చిరి రాజు ముందటం
గ్రంతకు నైనవస్తువులఁ గాంచనపాత్రలఁ గొంచు సంతతా
తాంతలతాంతకోరకవిలాసమనోహరపల్లవావళీ
కాంతఫలావలుల్ దనరఁ గామమనోహరవల్లికాకృతిన్.

సీ. ధమ్మిల్లములఁ బువ్వుదండలచెలువంబు
సూనశరప్రభలును సొబగు నొంద
నలికకస్తూరికాతిలకవిభ్రమములఁ
గుంతలరోచులఁ గొమరుమిగుల
రంగార నలఁదిన యంగరాగంబులఁ
జీనాంబరంబులుం జెలువుమిగుల
భాసురమోహనాపాంగమరీచులఁ
గర్ణభూషణములుం గలసి బెరయ

గీ. సంగదీప్తులఁ దొడవులు నసఁగి పెనఁగి
విదితపార్వతీకల్యాణవిభవవినుత
గానములు కర్ణపర్వము ల్గాఁగ నడచు
పేరటాండ్రయందంబులు బెడఁగుఁ జేసె. ౫౯

వ. ఇవ్విధంబున విభవంబులు మెఱయఁ బురంబుం బ్రవేశించిన వైభవసురేంద్రుం డైన కూళిపేంద్రుండు మించినవేడ్క నెదురు చనుదెంచి తోడ్కొని పోవం దదీయమందిరంబు ప్రవేశించిన యనంతరంబున సర్వజనంబు లయ్యెలనాఁగ వివాహవేదికాతలంబున నునిచి గంటపటం బెత్తించి యయ్యెడకు నక్కుమారుం దోడ్కొని యరిగిన. ౬౦

క. ఉండిరి కాంతయుఁ బతియును
గండపడము మాటునందుఁ గడునింపులతో

నిండిన వేడ్కలు దనరఁగ
నొండొరులం జూడఁ గన్ను లువ్విళ్లూరన్. ౯౧

వ. అంతం బురోహితమంగళాచారానంతరంబ మౌహూర్తిక
దత్త శుభముహూర్తంబునం దెర యెత్తించిన. ౯౨

సీ. లజ్జఁ గొండొకసేపు లలనదృగ్జాలముల్
తెప్పలలోనన యుప్పతిల్లు
విచ్చలవిడిఁ బర్వి విభునివీక్షణములు
మొలఁతమోమున మూర్తి మీఁదఁ బర్వఁ
దనరెడు వేడుకఁ దన్వంగిచూపులు
చెలువునిమోముపైఁ బొలసి మగుడఁ
జూపులు దార్కొన సుదతీలలామంబు
లలితంపు సిగ్గునఁ గళవళించు
నప్పుడు దమచందురులు గూడి యులకప్రోషి
యలరుఁబోఁడుల సరసోక్తు లమృతరసము
సోన నొలికించె నెంతయు సొబగుమిగిలి
తమకు నప్పుడు చెవుల నుత్సవ మొసర్ప. ౯౩

సీ. పల్యంకంబుల నున్న ప్రాలు దోయిట ముంచి
పాణిపద్మంబులు భ్రమలు నిండ
సేసలు వెట్టంగఁ జేతు లెత్తెడుచోటఁ
గరమూలరోచులు గ్రమ్ము దేర
చే(తెం)ట్లు దెచ్చుచో సితకటాక్షంబుల
మించి నీరెండల ముంచికొనఁగఁ
దఁ(బ్రా)లసందడిఁ జెలువపయ్యెద వాసి
యుబికన్నుఁగవకాంతి గిఱికొనంగఁ

దానుఁ జయ్యన ధవళాక్షతలు ధరించి
పొలఁతిమౌళిపై నినుపారఁ బోయు మిగులఁ
బాటలాసితసితహరిత్ప్రభలు దనరఁ
బాటవము లేక పతి తొట్రుపాటు నొందె. ౬౪

క. తలఁబ్రాలు వోయఁ దత్కర
జలజంబులపొందు పతికి జలజాననకున్
దళముగ సకలాంగములను
బులకాంకురవితతి నారు వోయుచు నుండెన్. ౬౫

ఇవ్విధంబున మహోత్సవానందకందళితమానసు లైనయా
దంపతులకు హోమానంతరంబ మాళవేశ్వరుం డనేకకరితు
రగరత్న భూషణచీనాంబరాదిమనోహరధనం బరణం బిచ్చి
వందిమాగధాదిజనంబుల కభీష్టధనంబు లొలంగి యుండ అ
న్నపానాదులం బరితృప్తులం జేసి దంపతుల నర్హామందిరం
బున నునిచె నయ్యవసరంబున. ౬౬

సీ. అబ్ధీశుసాంధ్యసేవాభిషేకమునకు
జలధి ముంచినహేమకలశ మనఁగ
జలధియుద్యానభూజంబున రాలిన
బంధురపరిపక్వఫల మనంగ
నంబుదదంతి గోరాడ నంబుధిఁ బడ్డ
యపరాద్రిధాతురాజాశ్మ మనఁగ
వరుణకుటుంబినీకరతలంబునఁ దప్పి
పడినమాణిక్యపుబంతి యనఁగ
వారుణీసక్తుఁడై జారి వనజబంధుఁ
డపరగిరిమీఁదఁ గాల్జాఱ నబ్ధిఁ బడియె

వాయసీసక్తులై పెఱవార లెట్లు
చక్కిలుపంగ నేర్తురు నిక్కమరయ. ౬౭

క. దినలక్ష్మి యినుఁడు చనుటయు
ననుగమనము సేయఁ బశ్చిమాచలమున నో
ట్టిన యెఱమంటలపోలిక
ఘనసంధ్యారాగరుచులు గడు నొప్పారెన్. ౬౮

గీ. మించె నెఱసంజ కెంపురి యామినీఁడఁ దాన
లల్లనల్లనఁ దోఁతెంచెఁ బెల్లుగాఁగ
నూతనంబుగ నంబరానోకహంబు
చిగురు నిండారఁ బెట్టె పూచెనో యనంగ. ౬౯

గీ. జలరుహంములు సూర్యబల మేమియును లేమిఁ
జంద్రుఁ డోప్పకునికిఁ జాలఁ గుందె
గ్రహబలంబు లేనికాలంబు నెంతటి
సిరులు గలుగువారుఁ జిక్కువడరె. ౭౦

సీ. మధుపసంఘంబులు మట్టి మల్లాడుచుఁ
కువలయంబులు చూఱఁగొనఁదొడంగ
ద్విజకోటి సన్మార్గవిహరణంబులు దక్కి
యడఁగి కుజాతుల నాశ్రయించెఁ
బతులచేరువ లేనిభామల దగ్గఱి
మారుండు భీతి నిండారఁ జేసెఁ
గులశీలవిధములఁ దలఁపంగనేరక
జారచోరావలి సంచరించె
మహి వివేకులు ఘనతమోమార్గులైరి
ఘోరవర్ణత వాటిల్లె లోకమునకు

సధిక తేజస్వి యగునినుఁ డస్తమింప
దివి యరాజకమై యున్నయవసరమున. ౨౦

ఉ. తాంతము లైనతాపకరతాపములు సేవలు దక్కి పోవఁగా
నంతట వచ్చి చొచ్చె మధుపావళి క్రోలుచు సోలుచుండఁ
గాఁ, గాంతవనాంత రాంతరనికామనివాసవిజృంభమాణసా
యంతనమల్లికాకుసుమహారిమనోహరసౌరభావలుల్. ౨౧

సీ. ఇది చనుదెంచెనే నేగరా దసిరెయొక్కొ
తోయజబంధుండు తొలఁగిపోయె
నిది తను రూపఱఁ బోదలెదు నసియొక్కొ
రాజు రయంబున రాక తడసె
నిది వెనుదగిలిన నేగరా దఁ రెయొక్కొ
చుక్కలు దీనిలోఁ జొచ్చి నెలసె
నిది క్రమింగు నసిరెయొక్కొ యిప్పుడు దీపరూ
పమున నిండులు సొచ్చెఁ బవనబంధుఁ
డనఁగ దెస లెల్లఁ గస్తూరి నలఁదినట్లు
మింట నెల్లను గాటుక మెత్తినట్లు
నుర్వి గలచుంతయును నీలి నూంచినట్లు
నంతకంతకు నగ్గల మయ్యెఁ దమము. ౨౩

వ. అయ్యవసరంబున. ౨౪

సీ. సిరితోడఁబుట్టువు చెంగల్వచెలిపొందు
ప్రొద్దుసంగడము తన్పుచకు నెలవు
చీఁకటిమూఁకలఁ జెండాడిననెఱరౌతు
మున్నీటి నుబ్బించు ముద్దుఁబట్టి

యుమపాలికన్ను పున్నమతేఁడు వెన్నుని
  వియ్యంబు తామరవిరులగొంగ
ముక్కంటి తలపూవు చుక్కలయేలిక
  వెన్నెల కందువు వేల్పుబువ్వ
కూడి పాసినవారలగుండెదిగులు
పాసి కలసినవారలపాలియింపు
పొడుపుఁగొండపైన నెఱయు బెడఁగు నొంది
మన్మథునిమామ యగుచందమామ పొడిచె. ౭౫

గీ. పూర్వగిరి వాసవట్టమై పొలుపు మిగులఁ
బద్మరాగలింగమువోలెఁ బ్రబలె రాజు
పూజ చేసినపనకంపుఁబూవులట్లు
ఉపరితలమునఁ దారక లొప్పు మిగిలె ౭౬

చ. సలలితలీలఁ బ్రాగ్వనితఁ జాలఁగ రాగముఁ బొందఁ జేసి
యుం, పొలయఁ గుముద్వతీసతికి నుల్లసనం బొదవంగఁ జే
యుచు, న్వలసిన తారకాంగనల వెన్నెలగందపుఁబూఁతచే
తఁ బెల్లలరంగఁ జేసె నప్పుడమృతాంశుఁడు దక్షిణనా
యకాకృతిన్. ౭౭

( గ్రంథపాతము)

...సంతోషంబు సిగుడుచుండ
వైభవముతోడ శృంగారవనము సొచ్చి
సీ. మంజీరమంజుల శింజితంబు సెలంగ

... ... ...

... ... లవిందులుచేసి
  పూవుఁదీగెలపొంతఁ బొలసి పొలసి

నెఱుపార నించువెన్నెలచలువ చూపుల
సొంపార మామిళ్ళ చూచి చూచి
... విరులు వేడుకఁ గోయఁ
గగము ... ...
... టలోఁ గరము వేడ్కఁ
దిరుగుచున్నట్టి సిగ్గరతెఱఁగు లనఁగ
నవవికాసంబు గలెలకు నవక మొసఁగ
వనములోపలఁ దిరిగిరి వనజముఖులు ౭౫

ఉ. పొగడంగ ... ...
... ... డుచువారు
నోపాటలాధర యీపాటలము నీవు
ముట్టకు మని యొట్టు వెట్టువారు
రాజాన యనుచు నీరాజానన దొలంగ
దఱుచూచు దీని ... ...
... ... లేవె
చెలు లిందు రండని చీరువారు
మొరయుపువ్వులు గనుఁగొని మెచ్చువారుఁ
జిలుకబోదలఁ బట్టంగఁ జేయువారు
నగుచు నెంతయు వేడ్కల నతిశయిల్ల
... ... ... ౭౬

సీ.... నారకొంత మోపి నిక్కటయును
మంజీరములు తొలిమాటసలుప
వామకరంబుల నరశాఖ లూఁదిన
మణిముద్రికలదీప్తి మాఱుమలయఁ

క. డోలాలీల లొనర్చుచుఁ
కేళీసదనంబులందుఁ గ్రీడింపుచుఁ గ్రీ
డాలాపములకు మెచ్చుచు
నాలేమయుఁ బతియు ... ... ౧౩

సీ. (నీకటాక్షంబుల నెర)సిన యెడలెల్లఁ
గలువలు పూచిన కరణిసుండు
నీమేని నెత్తావి నెగడిన సేపూవు
లైనను మంచి పైపుల్లు దోఁచు
నీయంగములకాంతి నిండిన లత లెల్లఁ
గనక పులతికల (కరణి వెలయు)
... ... ...
... జిగురుల పోల్కి నుండుఁ
జెలిసి తెలిసి కోమనకాని యలరులెప్పుడు
గోరి విచ్చలవిడి మాకుఁ గోయరాదు
నెలఁత నీహస్తము గలయుము నేఁటి కనుమఁ
బొలఁతి నొక్కతె ... ... ౧౪

గీ. ... ... కాలువ ల్దాఁటి దాఁటి
యెసఁగు పుష్పవితిట్టల నెక్కి యెక్కి
కోరి దప్పాల పువ్వులు గోసి కోసి
యలసియుచు మానకు... ౧౫

ఉ. ... ... ...కమలాకరుఁ దానన కేళి మాని యు
ష్ణాంగెను వేడ్కతోడఁ బువుఁబోఁడులుఁ దానును గూడి
భృంగచక్రాంగరథాంగముఖ్యవిహంగావృతముం...
... ... ... ... ౧౬

ఉ. చేరఁగఁ బోయి సొమ్ములును జీరలుఁ దీరమునందుఁ బెట్టి
చో, కాకరపు వల్వపావడలు గట్టి తనుద్యుతు లుల్లసిల్ల న
వ్వారివిహారలీల లనివారితసంభ్రమ మొప్ప .
... ... ... ... ౮౭

చ. ... ... చ్చినిత్యపరిపూర్ణమనోరథుఁ డౌచు వైభవ
స్ఫురణ దలిర్పఁగా నెలమిఁ బుత్రులుఁ బౌత్రులుఁ బాలఁగఁ
సుస్థిరరమణీయభోగము
... ... ... ...నివ్వటిల్లఁగన్. ౮౮

క. ఈకథలు వ్రాయఁ జదివిన
నాకర్ణన మొనరఁ జేయ నాయువు శ్రీయుం
జేకుఱఁగ సుఖింతురు శు
శ్లోకు లన... ... ... ౮౯

ఉ. ప్రతిమానదానవి
ద్యామహనీయవైభవకృతార్థితనుత్కలిరాజమత్సరో
ద్దామవిరోధిమంత్రిజనతాదృఢమంత్రరహస్య
... ... ... ... ౯౦

క. ... ... ...
నాటకముఖకోహళాదినాట్యరహస్యో
ద్ఘాటననిపుణప్రజ్ఞా
పాటవచాతుర్య నూత్నభరతాచార్యా. ౯౧

... ... కౌశల్యవాదా
ప్రాసక్తార్థిప్రకర ర్థనాతీతదానా
హాసాంకూరస్ఫుటజయా— ౯౨

గద్యము. ఇది శ్రీమద్వెన్నెలకంటి సూరనామాత్యపుత్ర హారితసగోత్ర పవిత్ర సుకవిజనమైత్రీ విధేయ అన్నయనామధేయప్రణీతంబైన షోడశకుమారచరిత్రంబునందు సర్వంబు నష్టమాశ్వాసము.

సిటీప్రెస్, కాకినాడ— 1934.